# రవాణా సమాచార్

# RAVAANA SAMACHAR

A TELUGU TRANSPORT MONTHLY



సంపుటి 6
సంచిక 4
ఏప్రిల్
1963

# रवाणा समाचार

సాలు చందా 3 రూపాయిలు

విడి 25 న.పై. ప్రతి

# ది రోడ్ వర్ధీ టైర్ వర్క్స్,

ఫుల్ సర్కూల్ టైర్ రీ ట్రేడర్సు

**విజయవాడ-2.**

నాణ్యమైన రబ్బరుతో, నిపుణులైన పనివారిచే సకాలమున బాగుచేసి

గ్యారంటీ ఇవ్వగల సంస్థ.

ఒకసారి పనిచేయించిన మీకే తెలియగలదు.



For Safety

Protection

Prompt Settlement of Claims

**Insure all your Motor Vehicles**

With

## The Motor Owners' Mutual Insurance Co., Ltd.

H. O:- BELGAUM

*Branch Office :*
27-6-58 upstair,
Besent Road, Governorpet,
VIJAYAWADA 2
Grams: 'MOTORISTS' Phone: 1078

*Regional Office :*
334, Thumbuchetty Street,
2nd floor,
MADRAS-1.
Phone: 4733

సంపుటి 6

సంచిక 4

ఫోన్ నం.

1087

రిజిష్టర్డ్ నం.

A-103




ధరల నదుపులో

ఉంచేందుకు

సహాయపడండి.

* * *

దేశరక్షణకోసం

పొదుపుచేయండి.

ఎడిటర్: జిల్లేపల్లి భాస్కరరావు.

శ్రీ శుభకృత్ నామ సంవత్సర చైత్ర శు॥ ష్ట ... వారం **1—4—63**

# ఉత్తమ దేశభక్తులు

ఏ ప్రదేశంలో పుట్టిపెరిగేవారికి ఆ దేశం మీాద భక్తి వుండవలసినలక్షణం. పుట్టి ప్రజ్ఞత వచ్చినతర్వాత విహారవాంఛల కతీతంగా ఆధ్యాత్మిక వాతావరణంలో సాగిపోతూకూడా తమ మాతృదేశంకోసం సర్వస్వంత్యాగంచేయటానికి వెనుకాడక జీవితమంతా దేశరక్షణలో సుశిక్షణలో సుజనభాతృజనుల సేవకు అంకితంచేసేవ్యక్తులు అరుదు, అయినా మన భారతదేశం అనాది నుండి దేశభక్తులకు కరువుపడలేదు. కర్మ, ధ్యానయోగ, త్యాగ, శౌర్యోజ్జీవన కార్యక్రమాలలో జాతికి జీవం కలిగిస్తూ ప్రబోధపూర్వకంగా అహింసమార్గాన ధర్మనిర్వహణసాగిస్తూ కాలాలు గడిపివేశారు. తమతమ సాధనాపరంపరవలన సత్యాన్వేషణ సాగిస్తూ ప్రపంచవాసులకే ఆదర్శరూపులయ్యారు.

పరప్రభుత్వపు దాస్యంలో మ్రగ్గేయాతనామయ జీవితపురోజుల్లో అనేక వందలకొలది భారతీయులు తమ విద్యుక్తధర్మంగా భావించి మాతృదేశఋణాన్ని తీర్చుకొనటానికి ప్రాణాలసైతం లెక్కచేయక పోరాటంసాగించి విముక్తికై పాటుబడ్డచరిత్ర మనకింతవరకు విశదమే. అట్లాంటి సంకులసమరవీరుడు జాతికి దిట్టఅయిన రాజేంద్రప్రసాద్ స్వాతంత్ర్యంవచ్చిన వెనుక అధ్యక్షులుగా పనిచేసి తనవిద్యుక్త ధర్మనిర్వ

హాణయందు ఏమరక గాంధీయుగధర్మాన్ని కాంగ్రెస్ ఆదర్శాన్ని నడిపి తనతపస్సు, జీవం, శక్తి, యుక్తి, సర్వస్వం స్వజన రక్షణకు స్వజన పోషణకు స్వజన పరిపాలనకు వినియోగించి భారతజనులందరికీ బాధ్యతల నప్పగించి స్వర్గస్థులయినారు. మహాయోగిగా, శాశ్వతత్యాగిగా, మానధనుడుగా చరిత్రపుటల్లో గౌరవాన్ని పొందగల్గ యీ వ్యక్తి చరితార్థుడు. ఆయన సేవలకు భారతజాతి ఋణపడివుంది. ఆయన ఆత్మశాంతికి మనమందరం ఆయన చూపిన శీలలపై దేశభక్తిని పెంచుకొని విపత్కర శక్తులను వినాశకర యుక్తులను అరికట్టి శాశ్వత స్వాతంత్ర్యఫలాన్ని అనుభవించాలి. ఆయన మనకు ఆదర్శప్రాయుడు.

ఈనాడు వడుదుడుకుల వాతావరణంలో సాగే ప్రపంచ ధోరణులలో పన్నులబెడద అనివార్యమంటూ రాజకీయపెద్దలు పాలనాధికారులు చెప్పి మనలను ఒప్పింప చూస్తున్నారు. మానసిక పరివర్తన కలిగించాలని మంచిచెడ్డల మాన్యతలోని న్యూనత గోచరింపచేయటానికా అన్నట్లు బంగారం విలువ తగ్గింది. ఎక్కువ కాలం పాటుబడాలని, అధికోత్పత్తి, సంపాదన కలిగించుకోవాలని సోమరిజీవితం లాలసపు విలాసాలబ్రతుకు తగ్గించుకోవాలని, పొదుపరితనం చేసుకోవాలని నీతి నిజాయితీలతో ప్రేమబాంధవ్యాన్ని జనపరివృతంగా పెంచుకొని దేశభక్తుల అడుగుజాడల్లో అమరవీరుల కర్మవీరుల పోకడలో అత్యవసర పరిస్థితులను అధిగమించి ప్రయాణం సాగించాలని ప్రబోధిస్తున్నారు. మరికొందరి భావన దేశంలో మరో విధంగావుంది. నటించే దేశభక్తితో అధికార కాంగ్రెసుకు మద్దతుతో పన్నుల ప్రమేయానికి ఒత్తిడిపద్ధతికి గురికాకుండా ప్రభుత్వపు విధానాన్ని ప్రవేశపెట్టినా మధ్యతరగతి జనులపైన గురిచూస్తూ (ఎందుకంటె జనాభాలో ఎక్కువ మంది అలాంటివారే ఉన్నారుగనక) జీవితావసరాలపై ధరలపెంపుసాగిస్తూ తమ పోషణకు మనుగడకు పునాదులు నిలిపి సౌధాలుగట్టి దేశభక్తులు వుండుటకు దేశభద్రతకు ప్రమాదమని గోలపెడుతున్నారు.

ఏ వ్యవస్థలోనైనా చట్టాన్ని కాని ధర్మాన్ని కాని నిర్వహించవలసివచ్చినప్పుడు ముఖ్యంగా ప్రజాస్వామ్యంలో యిలాంటి అభియోగ ప్రయోగాలు తప్పవు. దానివలన ఏ వ్యక్తిలోను దేశభక్తి కుంటుపడదు. స్వార్థానికి దూరంగా నిలచి యోచించేస్థిమితం కావాలి. దానికి శాసనకర్తలు పాలకులు అయిన అధికారవర్గం తమ ఓపిక ప్రదర్శించి విషయ పరిశీలనావకాశాన్ని గుర్తించి అనవసర అనుమానాలతో ఎదుటివారిపై అధికార దుర్వినియోగ పద్ధతిని ప్రయోగించరాదు. ఒక్కపనిలో నిష్ఠాతత చూపించాలనుకుంటే తనకిచ్చిన విధిని సక్రమంగా నిర్వర్తించి జనసామాన్యరక్షణ కార్యక్రమంలో తన పాత్రత తాను కలిగింపవలసిన న్యాయంచేకూర్చటానికి చేసే ప్రయత్నమే ముఖ్యంగాని, తనశక్తి పరులుచూచి భ్రమసి భయపడి తనపై గౌరవాధికారాన్ని పొంది వుండాలనుకోవటం కిరాతక వృత్తితో రాక్షసత్వాన్ని ప్రదర్శించి రావణుడు, హిరణ్యకశిపుడు మొదలయిన రాక్షసప్రవృత్తి గలవారు ప్రదర్శించిన ధర్మమే అవుతుంది. వారిలోనూ దేశభక్తి వుంది. కాని అది వారి మనోప్రవృత్తికి పరిమితమై "సర్వేజనాః సుఖినోభవంతు అనే సాము

( తరువాయి 10 వ పేజీలో )

# ఆంధ్రప్రదేశ్ మోటారు యూనియన్స్ కాంగ్రెస్ 13 వ మహాసభ




మహాసభ ప్రారంభోత్సవం చేస్తూ, ముఖ్య మంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు ఇలా అన్నారు :

"మోటారు రవాణా వ్యాపారంలో పోటీ వల్లను, అధిక పన్నుల వల్లను, నష్టము వచ్చుచున్నదనుట నమ్మజాలను. మిగతా వ్యాపారముల కంటె ఇందులో హెచ్చు లాభమువచ్చుచున్నదనుటకు యజమానులు చేయు ఆడంబరమగు ఖర్చులే నిదర్శనము. యజమానులు పదులు, నూర్లు లెక్క లేకుండా ఖర్చుపెట్టుచుందురు. ఏ మార్వాడీ వద్దనో అప్పుచేసి ఒక బస్సునో, లారీనో కొని, తంటాలుపడి రూటు సంపాదించుకుంటే అనతికాలంలోనే వారు హెచ్చుగా లాభము పొందగలుగుచున్నారు. ఇది కాదనలేము. సామాన్యపౌరులకూ, ధనవంతులకూ తారతమ్య మత్యధికముగా నుండుటచే దానిని తగ్గించుటకు సామ్యవాద పద్ధతే తగిన మార్గమని ఒకసూత్రం అంగీకరింపబడినది. ఆ ప్రకారం బస్సుల జాతీయము చేయుటకు ఉపక్రమింప బడినది. ఆంధ్రరాష్ట్ర మేర్పడకముందే తెలంగాణాలో బస్సులు ప్రభుత్వముచే నడపబడుచున్నవి. ఆంధ్రజిల్లా లన్నింటిలోనూ రవాణా ఒకే తూరి జాతీయము చేయుటకు

ద్రవ్యము చాలదు. ఒక్కొక్క జిల్లాకే సుమారు రెండుకోట్లు కావలసి వచ్చును. అందుచేత ఒకటి రెండు జిల్లాలు తీసుకొనబడుచున్నవి. 4 ఏండ్లలో అన్ని జిల్లాలలోను జాతీయ మొనర్చుటకు మొదట సంకల్పించితిమి గాని, గోదావరి- కృష్ణల పైన బ్రిడ్జీలు ఇంకా కా లేదు. ప్రభుత్వాదాయంకూడా చాలదు. కాన ఆరేడు సంవత్సరాలలోనైనా పూర్తి కాగలదని విశ్వసించుచున్నాను. మొదట విజయవాడలో ప్రారంభించినపుడు ఆందోళన హెచ్చుగా నుండెను. తర్వాత హైదరాబాదులో రవాణా సౌకర్యాలు చూచిన పిదప కొంత తగ్గిపోయెను. ఈసారి కర్నూలు జిల్లా రవాణా జాతీయ మొనర్చబడును. కారణం ప్రక్కనున్న గుంటూరు మహబూబ్ నగర్ జిల్లాలలో అప్పుడే జాతీయమైనవి. కర్నూలు, రాయలసీమకు ద్వారి. కాబట్టి ఈసారి దాని నేరుకొంటిమి. అంతే కాని, ఎవరికో సహాయపడవలెనను వ్యక్తిగత పక్షపాతము వల్లగాదు.

రోడ్ల అభివృద్ధి అవసరమేకాని, పరిమితమైన ప్రభుత్వాదాయముతో ఏది ముందు, ఏది వెనుక అభివృద్ధి చేయవలెనని యోచించి విద్య, విద్యుత్తు, వ్యవసాయ రంగాలకు ప్రాధాన్య మివ్వబడెను. అందువల్ల రోడ్లకు 5 కోట్లు మాత్రము కేటాయింపబడెను. దీనితో వీలైనన్ని సదుపాయములు చేయబడును.

పన్నులు, సర్ ఛార్జీలు కట్టకుండా కోర్టులకు వెళ్ళి లాభంలేదు. అందువల్ల కాలహరణమే గాని, తర్వాత అంతయూ ఒకేసారి న[illegible]లు చేయవలసి వచ్చును. అది చాల భారముగును. వసూలు చేయుట[illegible] ప్రభుత్వము కఠినచర్యలు తీ[illegible]వలసి వచ్చును. కాని నొప్పి పెట్టకుండా ఉండవలెనని కంతులు మేరకు చెల్లించుటకు ఏర్పాటు చేయబడినది. తగాదాలు పెంచుకొనకుండా సమరసంగా పోవుట మంచిదని సూచించుచున్నాను. పన్నులు హెచ్చించుటే ప్రభుత్వోద్దేశ్యము కాదు. కంట్రోళ్ళ వల్ల వ్యాపారులకు నష్టమే రాదు. తగినంత లాభమును ఏర్పాటు చేసియే నిబంధనలు ఏర్పాటు చేయబడును. రైతులకు 30 పర్సెంటు పన్నులు హెచ్చింపబడినవి. బీదలకు, ధనవంతులకువున్న తారతమ్యము తగ్గించుట ముఖ్యమని గమనింపవలెను.

లైసెన్సులు లేకుండా ఇంకా లారీలునడుస్తున్నట్లు తెలియుచున్నది. దానివల్ల పన్ను తప్పించుకొనజూచుచున్నారు. పన్నులువసూలు చేసి, ప్రజల మేలుకే వినియోగింపబడుచున్నదనుట తెలుసుకోవలెను. పన్నులు సరిగా చెల్లించునట్లు మీ సంఘము సహకరించ గోరుచున్నాను. మీ కష్టసుఖములు తెలుసుకొనుటకు నాకీ అవకాశమిచ్చినందుకు ధన్యవాదములు."

శ్రీ యం. రామన్నగారు (యం. జి. బ్రదర్స్) యీ విధముగ ఉపన్యసించిరి :

మోటారు ట్రాన్సుపోర్టు ఆపరేటర్లు ఎల్లప్పుడూ ప్రభుత్వముతో, సహకరించుచునే వున్నారు అనియు, కొంతమంది ఆపరేటర్లు కోర్టులో దావాలువేసి, ట్యాక్షేషనునుంచి రిలీఫ్ పొందినప్పుడు, ఆ రిలీఫ్‌ను రాష్ట్రంలోని ఆపరేటర్లు అందరకూ ఇవ్వవలెననియు, అటుల ప్రభుత్వము ఇవ్వకపోవుట వలన, యితర ఆపరేటర్లు కూడా రిలీఫ్ పొందుటకై కోర్టులకు వెళ్ళవలసి వస్తోంది అనియు, కావున యికనుంచి అయినా ప్రభుత్వము వారు ఆలోచించి, ఆపరేటర్లు కోర్టులకు వెళ్ళకుండా చేయుటకు

ఆ యా రిలీఫ్‌లను అందరికీ యివ్వవలయును అనియూ చెప్పిరి.

శ్రీ యం. వి. రామదాసు పంతులు గారు అంతరాష్ట్రీయ ట్రాన్సుపోర్టు సర్వీసులు విధానములోని లోపములను ప్రభుత్వము వెంటనే సవరించవలెననియూ, యీ సర్వీసుల అభివృద్ధికి అనుగుణముగ విధానములలో సవరణలు ప్రభుత్వము చేసికోవాలి అనియు చెప్పిరి.

శ్రీయుత పి. గోవిందరెడ్డిగారు శ్రీ పి. వి. సుబ్బయ్యచెట్టిగారూ, శ్రీ కె. లక్ష్మీనరసింహ శాస్త్రిగారూ, అనంతపురం జిల్లా లారీల యజమానుల సంఘం అధ్యక్షులూ, యితర ప్రతినిధులూ, ట్రాన్సుపోర్టు సర్వీసుల సమస్యలు - అంతరాష్ట్రీయ సర్వీసులను గురించి ఉపన్యసించిరి.

అధ్యక్షులు స్టేటు ట్రాన్సుపోర్టు మంత్రిగారైన శ్రీయుత బి. వి. గురుమూర్తిగారు అధ్యక్షోపన్యాసమును మృదు మధుర శైలిలో యిచ్చిరి.

దేశము యొక్క అత్యవసర పరిస్థితి దృష్ట్యా ట్రాన్సుపోర్టు సర్వీసుల విధ్యుక్త ధర్మములూ, 1962 సంవత్సరములో ప్రభుత్వమువారు ప్యాసు చేసిన టాక్సు చట్టము యొక్క చరిత్ర స్వభావమూ ట్రాన్సుపోర్టు సర్వీసుల మీదనే రాష్ట్రములోని వ్యవసాయము, పరిశ్రమల అభివృద్ధి ఆధారపడి వున్నది అనియూ, యీ సమస్యలను పరిష్కరించుకోవలసిన విధానములను గురించి విపులముగా ఉపన్యసించిరి.

## మహాసభలో ఆమోదింపబడిన తీర్మానములు :

1. ఆంధ్రప్రదేశ్ లోని బస్సులు, లారీల యజమానులను దేశము యొక్క అత్యవసర పరిస్థితులలో జాతీయరక్షణ నిధికి భూరి విరాళములు యిచ్చుచున్నందులకు వారి మాతృ దేశభక్తికి వారిని అభినందిస్తూ యీ అత్యవసర పరిస్థితి వున్నంతవరకూ దేశ రక్షణనిధికి సర్టిఫికేట్ల రూపముగా విరాళములు యిస్తూ వుండవలసినదిగ తీర్మానించడమైనది.

2. ఆంధ్రప్రదేశ్ స్టేటులో రోడ్ల అభివృద్ధికి గాను తయారు చేయబడిన యిరవై సంవత్సరముల రోడ్ల అభివృద్ధి ప్రణాళికనూ వాటి నిర్మాణమునకు నిర్ణయించిన అయిదువందలు కోట్ల రూపాయిల ఖర్చును అంగీకరించి [illegible] పథకమును 1961 సంవత్సరము నుంచి అమలు పరచుటకు నిర్ణయించిన ఆంధ్రస్టేటు ప్రభుత్వము వారిని యీ మహాసభవారు అభినందించుచున్నారు. ఈ పథకము వలన యిప్పుడున్నరోడ్లు విస్తీర్ణమునకు మూడు రెట్లు రోడ్లు ఏర్పడును.

3. రాష్ట్రములోని జాతీయరోడ్లు, స్టేటురోడ్లు ప్రక్కల ఖాళీ స్థలములలో యిండ్లు, షాపులు ఏ విధములైన కట్టడములుగాని ఆ రోడ్ల మార్జినుకు అరవై గజముల లోపల నిర్మాణములను రాష్ట్ర ప్రభుత్వమువారు నిషేధించవలెననియు, మున్ముందు సువిశాలమైన రోడ్లు ట్రాన్సుపోర్టు సర్వీసుల అభివృద్ధికి ఎంతైనా అవుసరం అన్నియు, కావున ప్రస్తుతము పట్టణములలోనూ గ్రామములలోనూ మధ్యగా వున్న స్టేటు జాతీయరోడ్లనూ వాటికి దూరముగా వుండునటుల రోడ్లు సువిశాలమైన

క్రొత్త రోడ్ల నిర్మాణమునకు పూనుకొనవలెనని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములకు యీ మహాసభ సిఫార్సు చేయుచున్నది.

4. మోటారు బండ్లకు ప్రయిమరి పర్మిట్లు వున్న రాష్ట్రములోనే సింగల్ పాయింటు సర్ ఛార్జి మాత్రమే 1–1–1963 తేదీ నుంచి వసూలు చేయుటకు మనము కోరినంత మాత్రమునకే మద్రాసు ప్రభుత్వము వారితో వప్పందము చేసికొనినందులకు ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారిని యీ మహాసభవారు అభినందిస్తున్నారు. 1–1–1963 తేదీ నుంచి యీ ఎగ్రిమెంటు తేదీనాటికి వసూలు చేసిన సర్ ఛార్జి మొత్తములు వున్నచో, అయా మొత్తములను ఆ యా మోటారు బండ్ల యజమానులకు రిఫండు చేయవలసినదిగ మద్రాసు, ఆంధ్ర ప్రభుత్వముల వారిని యీ మహాసభ వారు కోరుచున్నారు.

అంతరాష్ట్రీయ సర్వీసులు

5. ఆంధ్ర ప్రదేశ్ లోని లారీలకు ప్రక్కన వున్న రాష్ట్రములలో తిరుగుటకు అంతరాష్ట్రీయ పర్మిట్లు ధారాళముగ ఇవ్వవలెననియూ, సరిహద్దు రాష్ట్రాలతో ఎగ్రిమెంటు చేసికొనిన అంతర్రాష్ట్రీయ లారీల పర్మిట్లు పరిమితికైనా వెంటనే పర్మిట్లను సరిహద్దు రాష్ట్రములు యివ్వవలెననియూ తీర్మానించడమైనది.

6. ఈ జాతీయ అత్యవసర పరిస్థితులలో మోటారుబండ్లు వేగముగ తిరిగి,ఎక్కువసరకులను రవాణా చేయుటకు ఎంతైనా తోడ్పడవలెను అని కేంద్ర ప్రభుత్వము హెచ్చరిక చేస్తున్నది. ఆంధ్ర ప్రదేశ్ లో ఎక్కువ ముడీ సరుకులు ఉత్పత్తి అగుచుండుట వలనసూ, ఈ సరుకులు యితర రాష్ట్రములకు రవాణా చేసేందుకు ఈ రాష్ట్రములోని లారీలు ఎక్కువగా అవుసరము గావున అదృష్ట్యా సరిహద్దు రాష్ట్ర ప్రభుత్వములు మన రాష్ట్రములోని లారీలకు అంతరాష్ట్రీయ పర్మిట్లు ఎక్కువ యిచ్చేటట్టుల మన రాష్ట్ర ప్రభుత్వము చేయవలెనని హెచ్చరించుచూ తీర్మానించడమైనది.

-•- బస్సుల జాతీయము -•-

7. ఆంధ్రప్రదేశ్ స్టేటురోడ్డు ట్రాన్సుపోర్టు కార్పరేషనువారు తలపెట్టిన కర్నూలు జిల్లాలోని బస్సుల జాతీయకరణను ఈ దేశములోని అత్యవసర పరిస్థితులు పోవువరకు లేదా రెండు సంవత్సరములైనా వాయిదా వేయవలెనని తీర్మానించడమైనది.

అందుకు ప్రత్యామ్నాయముగ స్టేటులోని కొన్ని ప్రాంతములలో లాంగ్ డిస్టెన్సు రూట్సు మీద రోడ్డుట్రాన్సుపోర్టు కార్పరేషన్ వారు బస్సులను నడుపుకొనవచ్చును అని తీర్మానించడమైనది.

8. కొన్నిబ్యాంకులు మోటారు ట్రాన్సుపోర్టు ఆపరేటర్లకు, ఫ్లీటుబస్సులయజమానులకు తక్కువ వడ్డీకి ఋణసౌకర్యములు యిచ్చుచున్నారు. ఆంధ్రప్రదేశ్ లో రెండు మూడు మోటారు బండ్లువున్న యజమానులు ఎక్కువగా 8% వున్నారు కాబట్టి, వారికికూడా యీ ఋణసౌకర్యములుయిచ్చుటకు యేర్పాటు జేయవలసినదిగ ఇండియన్ బ్యాంకింగ్ ఎసోసియేషను శక్రటరీగారిని కోరుతూ తీర్మానించడమైనది.

9. ఆంధ్రప్రదేశ్ లోని మునిసిపాలిటీలు, పంచాయితీబోర్డులు కొన్ని బస్సు లారీస్టాండు ఫీజులను వసూలు చేయుచున్నవి. బస్సుస్టాండు

లలో ప్రయాణీకులకు కనీస సౌకర్యములుకూడా లేవు. మంచిమరుగు దొడ్లుగాని, మంచినీటి పంపులుగాని, ప్యాసింజెర్లు వుండుటకు షెడ్లుగాని లేవు. సరుకులు దింపుకొనుటకు లారీలకు ప్లాటు ఫారములు లేవు. సరుకులు వుంచుకొనుటకు చిన్న గోడవునులు కూడ లేవు. వీటిని వెంటనే ఆయా సంస్థలు నిర్మించవలెను. లేనిచో ఆయా బస్సు స్టాండుల ఫీజులూ, లారీలస్టాండుల ఫీజులూ చెల్లించ వలసి యుండునా, అక్కర లేదా అను విషయము బస్సులు, లారీల యజమానులకు ఆలోచనీయము అని తీర్మానించడమైనది.

### స్టేటు వ్యాపితమైన పర్మిట్లు

10. లారీలకు స్టేటు వ్యాపితమైన పర్మిట్లు యివ్వవలసిందిగా ఆంధ్ర ప్రభుత్వమును కోరుచూ తీర్మానించడమైనది.

ఆంధ్రప్రదేశ్ మోటారు యూనియన్ల కాంగ్రెసు వారు 12వ మహాసభలో చేసిన తీర్మానము ననుసరించి రాష్ట్రప్రభుత్వము వారు లారీలకు జోనల్ పర్మిట్లను యిచ్చి వున్నారు. ఇప్పుడు ఈజోనల్ పర్మిట్లవలన కూడ రవాణా సౌకర్యాలు ఎక్కువగాలేవు. లక్షకు పైగా చ మైళ్ళ విస్తీర్ణము కలిగి, పది హేను వేలకు పైగా గ్రామములువున్న యీ రాష్ట్రములో రైళ్ళ మైలేజి చాలా తక్కువ. రోడ్డు రవాణాయే ఎక్కువ అవుసరము కావున త్వరగా సరుకులు రవాణా కావలెను అంటే లారీలకు స్టేటు వ్యాప్తమైన పర్మిట్లను ప్రభుత్వమువారు యివ్వవలయును అని తీర్మానించడమైనది.

### సిటీ టవును బస్సు సర్వీసులు

11 ఆంధ్రప్రదేశలో కొన్ని పట్టణములలో టవునుబస్సు సర్వీసులు వున్నవి. ఉదయం, సాయంకాలమూ కొన్ని గంటలలో ప్రయాణీకుల వత్తిడి విపరీతముగ వుంటుంది. ఆయా కాలములలో యిదివరకువలెనే, ఎక్కువమంది స్టాండింగ్ ప్రయాణీకులు వుండుటకు తగినరీతిగ రూల్సును సవరణ చేయవలసినదిగ కోరుచూ తీర్మానించడమైనది.

12. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు టాక్సులను విపరీతముగా పెంచుటవలన, బస్సుల ఖరీదుకూడా ఎక్కుటవలననూ, కొనుగోలు శక్తి లేకపోవుటవలననూ, దేశరక్షణ రీత్యా, కొత్త బండ్లు విడుదలకూడా పరిమితి తగ్గుటవలననూ, బస్సులలోకూడా యీ అత్యవసర పరిస్థితులననుసరించి, స్టాండింగ్ ప్యాసింజర్లకు మునుపటివలెనే అనుమతి యివ్వవలసినదిగా రాష్ట్రప్రభుత్వమును కోరుచూ తీర్మానించడమైనది.

### స్పేరుబస్సులు

13. రోడ్డురవాణా సర్వీసులలో, ప్రయాణీకుల సౌకర్యముకొరకు వాడబడె స్పేర్ బస్సులను మోటారు వెహికల్సు టాక్సునుంచి మినహాయించవలసినదిగ తీర్మానించడమయినది. టాక్సులు చెల్లించినబస్సులు ఏకారణముచేతనైనా నిలిచిపోయినప్పుడు మాత్రమే, ఈ స్పేరుబస్సులు ప్రయాణీకుల సౌకర్యముకొరకు ఆ బస్సుల స్థానే ఉపయోగించుటకు యేర్పరచబడినవి. ఆ టాక్సులు చెల్లించిన బస్సులస్థానములోనే యీ స్పేరుబస్సులు, పనిచేయునుకాబట్టి స్పేరుబస్సుల మోటారు వెహికిల్సు టాక్సునుంచి మినహాయించవలెనని తీర్మానించడమయినది.

14. 1962 సంవత్సరములో ప్యాసు చేయబడి 1–4–1963 నుండి అమలులోనికివస్తున్న ఆంధ్ర ప్రదేశు మోటారు వెహికిల్సు టాక్సు యాక్టు ననుసరించి మోటారుబండికి మూడు నెలల టాక్సు యడ్వాన్సు పేమెంటుచేయవలెను. ఈ మొత్తము చాలా ఎక్కువభారముగా వుంటుంది కాబట్టి, ఆ టాక్సును ప్రతినెలా 15వ తేదీలోగా యడ్వాన్సుగా చెల్లించేటట్లుగ రూల్సుమార్పు వెంటనే చేయవలసినదిగ ప్రభుత్వమును కోరుతూ తీర్మానించడమయినది.

15, తూర్పు గోదావరిజిల్లా, గోదావరి నది ఆనకట్టమీద మూడుటన్నుల బరువుకంటె యెక్కువ బరువు సరుకులను లారీలు తీసుకొనివెళ్ళకూడదు అన్న ఛీఫ్ ఇంజనీరు ఉత్తరువుల వలన ఆ ఆనకట్టమీద నడిచే లారీ ట్రాన్సుపోర్టు సర్వీసులకు చాలా కష్టములు, నష్టములూ కలుగుట వలన ట్రాన్సుపోర్టు కుంటుపడుతుంది. కాబట్టి యధావిధిగా అదివరకువలె బరువుపరిమితిని తీసివేసి, అన్నిలారీలూ ఆనకట్టమీద వెళ్లుటకుల ఏర్పాట్లు చేయించ వలసినదిగ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించడమయినది.

16. బస్సులు, లారీలూ, ముఖ్యముగ ప్రజా సామాన్యమునకు ఉపయోగపడునుగావున వీటిని వీటికి అవుసరములయ్యే స్పేరుపార్టులను సేల్సు టాక్సు విధింపులో వీటిపైన సామాన్యపురేటునే విధించవలెననియు, యిప్పుడు వీటిమీద అమలులోనున్న లగ్జరీవస్తువుల టాక్సు 7 పర్సంటు నుండి 2 పర్సంటునకు మార్పించవలెను అనియు, కేంద్ర రాష్ట్రప్రభుత్వములను కోరుచూ తీర్మానించడమైనది.

17. జాతీయ రవాణావిధానమును రూపొందించేందుకు రిపోర్టు తయారుచేయుటకు కేంద్ర ప్రభుత్వమువారు నియమించిన, నియోగి కమిటీ రిపోర్టు తయారుకు యింకనూ కొన్ని సంవత్సరములు పట్టునుగావున, రాష్ట్రములో ట్రాన్సుపోర్టు సర్వీసులు అభివృద్ధిదృష్ట్యా కేంద్ర ప్రభుత్వపు విధానము ననుసరించి, రవాణా సర్వీసులను సమర్థవంతమయిన సహకార సంస్థలుగా గాని, మరోవిధముగాగాని చేయుటకు అవసరమయిన సవరణలు సహకారచట్టములో, పంజాబు రాష్ట్రమువలెచేసి రవాణా సర్వీసుల సంస్థలకు తోడ్పడవలసినదిగా ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము వారిని కోరుచూ తీర్మానించడమయినది. ఈ తీర్మానములు మహాసభలో ఏకగ్రీవముగ అంగీకరించబడినవి.

య. రామబ్రహ్మం,
జనరల్ సెక్రటరీ

( 1 వ పేజీ తరువాయి )

దాయక రక్షణ సూత్రానికి, భగవత్తత్వానికి వర్తించదు. మనకు ప్రతినిధిగా అధ్యక్ష పదవి నలంకరించి నేడు స్వర్గధామం చేరిన రాజేంద్ర ప్రసాద్ మనకు ఆదర్శప్రాయుడనటానికి ముఖ్య కారణం, అధికారంలో ఆడంబరానికి గుణాగర్వానికి తావుకల్పింపక తనధర్మమేదో దానినిగుర్తించి, ఆత్మను ప్రజాసేవకంకితమయిన తపస్సులో నింపి గుణదోషాల కతీతంగా పరిపాలనావ్యవధి గడపివేశారు. కంటకితమైన జీవితానికి తావీయక దేశవ్యాప్తంగా కీర్తి నార్జించారు. వేషభాషల్లోను, వేదికోపన్యాసాలలోను దేశభక్తి కనబరచే చౌకబారుపద్ధతినిగాక సుజీవితమయి, ఆచరణాత్మకంగా దేశభక్తిని విధినిర్వహణలో జోడించి బ్రతికేవారే నిజమయిన దేశభక్తులు.

# ఆంధ్రప్రదేశ్ - మోటారు పన్నుల చట్టము

మోటారుబండ్లపై పన్ను విధింపు.

(1) రాష్ట్రములో పబ్లికుప్రదేశమందు వాడుచున్న లేదా వాడుటకు ఉంచిన ప్రతిమోటారుబండి మీాదను పన్ను విధింపబడవలెనని ప్రభుత్వమువారు అప్పుడప్పుడు ప్రకటనద్వారా ఆదేశమీాయవచ్చును.

(2) (1) ఉప-విభాగము క్రింద జారీ చేయబడిన ప్రకటన ఏ తరగతి మోటారుబండ్లపైన ఆయా కాలపరిమితులకు ఏ రేట్లపైన, ఏ తేదీనుండి పన్ను విధింపవలెనో నిర్దేశించవలెను.

అయితే పన్ను రేట్లు మొదటిషెడ్యూలు (1) వ గడిలోని సంబంధించిన [illegible] తెలిపిన న్యూమాటిక్ టైర్లు బిగించినటి మోటారుబండ్ల తరగతుల విషయములో ఆషెడ్యూలులోని [2] వ గడిలో తెలిపిన గరిష్ఠమొత్తమును మించకూడదు. న్యూమాటిక్ టైర్లు [illegible] ఇతర టైర్లు బిగించినట్టి మోటారుబండ్ల విషయములో పన్ను రేట్లు అట్టి గరిష్ఠమొత్తమునకు ఒకటిన్నర రెట్లకు మించకూడదు.

(4) పన్నుచెల్లింపు, లైసెన్సు మంజూరు—[1] (ఎ) ఈ చట్టము క్రింద విధించిన పన్నును మోటారుబండి రిజిష్టరు ఖాతాయందు లేదా దాని స్వాధీనములోగాని అజమాయిషీలో గాని వుంచుకొనిన ఎవరైన ఇతరవ్యక్తి ముందుగాను 11 వ విభాగములో తెలిపిన పద్ధతిలోను చెల్లించవలెను. ఆయన కోరుకొను రీతిగా పావుసాలు, అర్ధసంవత్సరము లేదా సంవత్సరము వారీగా ఈ పన్నును చెల్లించవచ్చును. ఆయన పావుసాలు, అర్ధసంవత్సరము లేదా సంవత్సరమునకు తీసుకొనవలసియున్న లైసెన్సునుబట్టి సందర్భానుసారముగా ఆ పావుసాలు, అర్ధసంవత్సరము లేదా సంవత్సరము ప్రారంభమునుండి ఏడు దినములలోపల ఈ పన్ను చెల్లింపవలెను. అర్ధసంవత్సరపు లైసెన్సుకు పన్ను, పావుసాలు లైసెన్సు పన్నుకు రెండు రెట్లకు మించకూడదు. సంవత్సరము లైసన్సుకు పన్ను పావుసాలు లైసెన్సు పన్నుకు నాలుగురెట్లకు మించకూడదు. అర్ధసంవత్సరము, సంవత్సరము లైసెన్సుల విషయములో ప్రభుత్వమువారు నిర్ణయింపబడు ముదరా మంజూరు చేయవచ్చును.

(బి) ఏదైన పావుసాలుకు, అర్ధసంవత్సరమునకు మోటారుబండి పన్ను చెల్లించి యుండి ఆ పావుసాలు, అర్ధసంవత్సరము లేదా సంవత్సరము అంతముగాని అందులో వరుసగా ఒక మాసమునకు తక్కువగాని కాలముపాటుగాని మోటారుబండి వాడనిచో, ప్రభుత్వము అప్పుడప్పుడు ప్రకటించు రేట్ల చొప్పున పన్ను ముదరా ఈయవలెను. ఈ ముదరా చెల్లింపు ఆ ప్రకటనలో నిర్దిష్ట పరచబడు షరతులకు లోబడి యుండవలెను.

(2) (1) వ ఉప-విభాగములో ఏమి యున్నప్పటికి ఒక మోటారుబండి విషయములో ఏదైనా ఒక కాలపరిమితిని చెల్లించవలసియున్న పన్నును అదివరకే మరొక వ్యక్తి చెల్లించినచో ఆ కాలపరిమితికి ఆమోటారుబండివిషయములో ఏ వ్యక్తి గానీ పన్ను చెల్లించ నవసరము లేదు.

3. (ఏ) ఒక మోటారుబండి విషయములో పన్నును ఏదైనా ఒక కాలపరిమితికి ఏ వ్యక్తి అయినను చెల్లించనిచో లేదా ఆ కాలపరిమితికి ఎట్టి పన్ను గాని చెల్లించనవసరము లేనిచో లైసెన్సింగు అధికారి:-

1 సదరు కాలపరిమితిలో రాష్ట్రములోని ఏదైనా సార్వజనిక ప్రదేశమందు ఆ మోటారు బండిని వాడుటకు ప్రభుత్వమువారు ప్రకటించునట్టి నమూనాలో లైసెన్సునొకదానిని అట్టి వ్యక్తి కిమంజూరు చేయవలెను.

(2) మోటారుబండ్ల చట్టము క్రింద ఏ మోటారుబండి విషయములో అట్టి సర్టిఫికేటు మంజూరు చేయబడినదో దాని రిజిస్ట్రేషను సర్టిఫికేటులోనో, మోటారుబండి విషయములో అటువంటి రిజిస్ట్రేషను సర్టిఫికేటు మంజూరు చేయబడనిచో ప్రభుత్వమువారు ప్రకటించునట్టి నమూనాలో ఉండు సర్టిఫికేటులోనో సదరు కాలపరిమితికి ఆ మోటారుబండి విషయములో పన్ను చెల్లించబడినదనీ లేదా ఎట్టి పన్నుగానీ చెల్లించనవసరము లేదనీ వ్రాయవలెను.

[బి] ఈఉప-విభాగములోని (ఎ) క్లాజు మంజూరు చేసిన ప్రతి లైసెన్సు రాష్ట్రమందంతటనూ చెల్లుబడి కావలెను.

(4) 3వ విభాగములో లేదా 1 వ ఉప-విభాగములో ఏమి ఉన్నప్పటికినీ ప్రభుత్వము వారు, ఆయా సమయములందు ప్రకటనద్వారా అట్టి ప్రకటనలో నిర్దేశింపబడు షరతులకు లోబడి పన్ను చెల్లించినమీదట ఏ తరగతి మోటారుబండి విషయములో నయినను దఫాకు ముప్పదిరోజులు మించని కాలపరిమితికి తాత్కాలిక లైసెన్సును ఇవ్వవచ్చునని ఆదేశించవచ్చును.

అయితే ఆ పన్నురేటు రెండవ షెడ్యూలు 1 వ గడిలోని సంబంధించిన నమూనాల్లో తెలిపిన న్యూమాటిక్ టైర్లు బిగించినట్టి మోటారు బండ్లు తరగతుల విషయములో రెండవ షెడ్యూలు (2), (3) గడులలో తెలిపిన గరిష్ఠ మొత్తమును మించరాదు; న్యూమాటిక్ టైర్లు కాకుండా ఇతరటైర్లుబిగించినట్టి మోటారుబండ్ల తరగతుల విషయములో పన్నురేటులో గరిష్ఠ మొత్తమునకు ఒకటిన్నర రెట్లకు మించరాదు.

(5) ఏమోటారుబండిగాని 3వ విభాగము (1) ఉప – విభాగము క్రింద ప్రకటన జారీ అయిన మీదట ఏ సమయమందైనను ఆ సమయములో దానిని వాడుటకనుమతించుచు(1)వ ఉప - విభాగము (ఏ) క్లాజులోకాని (4)వ ఉప - విభాగములో గాని నిర్దిష్ట పరుచబడిన విధముగా, లైసెన్సు పొందియున్ననే తప్ప, రాష్ట్రములోని ఏ పబ్లిక్ ప్రదేశమందైనను వాడబడగూడదు.

5. మోటారు బండిపై లైసెన్సును అంటించుట, కొందరధికారుల అభ్యర్థనపై మోటారు బండిని ఆపుట.

(1)(ఏ)ఏ మోటారు బండినిగాని నాల్గవవిభాగము 3వ ఉపవిభాగము ఏ క్లాజు క్రింద ఆ బండి విషయములో మంజూచేయబడిన లైసెన్సు ప్రభుత్వము వారు ప్రకటించు విధముగా మోటారుబండిపై అంటింపబడిననే తప్ప ఎట్టి పబ్లికు ప్రదేశమందు గాని వాడబడ కూడదు.

(బి) లైసెన్సు ఆ విధముగా మోటారు బండిపై అంటించ బడనిచో రిజిష్టర్డు ఖామందు లేదా దానినిస్వాధీనములోగానిఅజమాయిషీలో గాని వుంచుకొనిన వ్యక్తి యాబది రూపాయల వరకు జరిమానాతో శిక్షింప బడదగి యుండవలెను.

(2) (ఎ)ప్రకటింపబడు హోదాకు తక్కువకాని హోదాగల రవాణాశాఖ అధికారి ఎవరైనను లేదా సబిన్స్పెక్టరు హోదాకు తక్కువకాని హోదాగల యూనిఫారములోవున్న పోలీసు అధికారి లేదా నిర్ణయించబడు తదితర అధికారి పబ్లికు ప్రదేశములో మోటారు బండినిఆపవలసినదిగా దాని డ్రైవరును కోరవచ్చును. ఆ మోటారు బండి విషయములో లైసెన్సు సక్రమముగా పొందినట్లు తాను తెలుసుకొను నిమిత్తము న్యాయముగా అవసరమగునంత కాలము ఆ బండిని నిలిపియుంచవచ్చును.

(బి) ఈ ఉప- విభాగములోని (ఏ) క్లాజు క్రింద అధికారి ఎవరైనను మోటారు బండిని ఆపవలసినదిగా కోరినప్పుడు బుద్ధిపూర్వకముగా ఆ బండిని ఆపనట్టి లేదా అట్టి అధికారినిఅడ్డగించునట్టి ఎవరైనవ్యక్తి ఏబది రూపాయలవరకు జరిమానాతో శిక్షింపబడదగి యుండవలెను.

6. పన్ను చెల్లించనందుకు దండన :-

ఏదైన మోటారుబండివిషయములో చెల్లించవలసియున్న పన్ను 4వ విభాగములో నిర్దేశించిన విధముగా చెల్లించనిచో రిజిష్టర్డు ఖామందు లేదా దాని స్వాధీనములోగాని అజమాయిషీలోగాని వుంచుకొనిన వ్యక్తి, ఆయన చెల్లించ వలసియుండు పన్నుకు అదనముగా దండనను చెల్లించుటకు పాత్రుడు కావలెను. ఈ దండనను నిర్ణయింపబడు అధికారి లిఖిత పూర్వకమైన ఉత్తరువుద్వారాను, నిర్ణయింపబడు పద్ధతిలోను విధించును. ఇది ఆ బండివిషయములో సంవత్సరము వారిపన్నుకు రెండింతలవరకువుండవచ్చును.

7. భూమి శిస్తుబకాయి మాదిరిగాపన్ను, దండన లేదా జరిమానా వసూలుచేయుట :-

ఈ చట్టముక్రిందచెల్లింపవలసిన ఏదైనపన్ను, దండన లేక జరిమానాను భూమిశిస్తు బకాయి మాదిరిగా రాబట్టుకొనవచ్చును. పన్నుదండన లేదా జరిమానా చెల్లింప వలసియుండు మోటారుబండి లేదా దాని యాక్సెసరీలను, పన్నును, దండనను, జరిమానాను చెల్లించుటకు పాత్రమైయుండు వ్యక్తిస్వాధీనములో గాని అజమాయిషీలో గాని ఉన్ననూ, లేకపోయిననూ అట్టి మోటారుబండిని లేక దానియాక్సెసరీలను జప్తుచేసి అమ్మివేయ వచ్చును.

8. పన్ను చెల్లించనిచో మోటారుబండ్లను పట్టుకొని నిలిపియుంచుటకు అధికారము.

6, 7, విభాగముల నిబంధనలకు భంగము కలుగకుండ, ఏదైన మోటారు బండి విషయములో చెల్లింపవలసియుండు పన్నును 4వవిభాగములో నిర్దిష్టపరచ బడిన విధముగచెల్లించనిచో, నిర్ణయింపబడు అధికారి, ఈ చట్టము క్రింద పన్నుచెల్లించ వలసియుండు మోటారు బండిని పట్టుకొని నిలిపి యుంచవచ్చును. ఈ కార్యము నిమిత్తము ఆ బండి విషయములోచెల్లింపవలసియుండు పన్నును చెల్లించునంత వరకు బండిని తాత్కాలికముగా భద్రి పరచుటకు తా నవసరమని భావించునట్టి చర్యలనుతీసికొన వచ్చును, లేదా తీసికొనునట్లు చేయవచ్చును.

9. పన్ను మినహాయింపు, తగ్గింపు, తదితర మార్పులు:-

1. ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా –

(ఏ) (i) ఎవరైన వ్యక్తి లేకవ్యక్తులతరగతి లేదా –

(ii) ఏదైన మోటారుబండి లేదా మోటారుబండ్ల తరగతి లేదా ఏదైన ప్రత్యేక ప్రాంతమందు నడుప బడుచున్న మోటారు బండ్ల విషయములో చెల్లింపదగి యుండు పన్నుమినహాయింపును మంజూరు చేయ వచ్చును, రేటులో తగ్గింపు చేయవచ్చును, లేదా రేటులో పెరుగుదల కలుగకుండ తదితరమైన మార్పుకు ఉత్తరువు చేయ వచ్చును.

బి. అట్టి మినహాయింపు, తగ్గింపు, తదితరమైన లేదా మార్పును రద్దుచేయవచ్చును, లేదా మార్చ వచ్చును.

(2) (1) ఉప విభాగము క్రింద జారీచేసిన ప్రకటన అది జారీ అయినతరువాత వీలైనంత వెంటనే రాష్ట్ర శాసనసభ సమావేశమందున్నప్పుడు మొత్తము రెండు మాసముల కాలము పాటు ఆ సభా సమక్షమున వుంచబడవలెను. ఈ కాలము ఒకే సమావేశమునకుగాని వరుసగా వచ్చు రెండు సమావేశములకు గాని చెంది వుండ వచ్చును.

10. కేవలము వ్యవసాయ, మైనింగు కార్యముల కొరకు రూపొందించబడి వాడబడుచున్న మోటారు బండ్లకు ఈ చట్టపు నిబంధనలు వర్తింపకుండుట :-

ఏదైనవ్యవసాయభూమి లేదా గనిఖామందు లేదా ఆక్రమణదారు పేరిట రిజిష్టరయిన మోటారు బండి విషయములో అట్టి భూమి ఆయన స్వంత సాగుక్రింద ఉన్నఎడలను లేదా ఆ గనిని ఆయన స్వయముగా త్రివ్వించుచున్న ఎడలను, మోటారుబండి ఆ భూమిపై లేదా అట్టి ఆ గనిలో లేదా అట్టి భూమి లేదా గని హద్దులనుండి పదునైదు మైళ్ళ దూరములోపల వ్యవసాయ కార్యములను లేదా మైనింగుకార్యములను కొనసాగించుటకు మాత్రిమే ఉద్దేశింప బడి వాడబడుచున్నయెడలను – ఈచట్టములోని దేదియు వర్తించ కూడదు.

1.వ వివరణ :-

ఈ విభాగము యొక్క కార్యమునిమిత్తము "వ్యవసాయ కార్యము" అనగా దున్నుట, విత్తనములు చల్లుట, నూర్చుట వ్యవసాయోత్పత్తిని క్రిమింగు చేయుట లేక వ్యవసాయము నిమిత్తము జరుపు అదే విధమైన ఏదైన ఇతర కార్యము అని అర్థము.

అయితే :-

(ఎ) భూమి హద్దులనుండి పదిహేను మైళ్ళ దూరము లోపల, లేదా

(బి) భూమి హద్దులనుండి మిక్కిలి దగ్గరలో నున్న మార్కెటు ప్రదేశమునకు దూరముతో నిమిత్తము లేకుండా అట్టి మార్కెటుకు లేదా మార్కెటునుండి యజమాని లేదా ఆక్రమణదారు స్వంతకార్యము నిమిత్తము రవాణా చేసుకొనునప్పుడుతప్ప – వ్యవసాయ కార్యముల నిమిత్తము మనుష్యులను, పశువులను లేదా సరకులను రవాణాచేయుట లేదా వ్యవసాయ ఫలసాయమును రవాణాచేయుట ఈ "వ్యవసాయ కార్యము" అనుమాటలో చేరదు.

2.వ వివరణ

ఈ విభాగపు కార్యము నిమిత్తము "స్వంత వ్యవసాయము" అనగా ఒక వ్యక్తి తన స్వంత భూమిని, తన స్వంతబాధ్యతపై-

(1) తన స్వయంకృషిచే,

(2) తన కుటుంబములోని ఎవరయిన సభ్యుని కృషిచే

(3) తనస్వంతపర్యవేక్షణ క్రిందగాని తన బంధువులలో ఒకరి స్వయత పర్యవేక్షణ క్రిందగాని రొక్క రూపములో లేదా వస్తురూపములో లేదా రెండింటి రూపములోను చెల్లింపబడగియుండు వేతనములపై నౌకరులతో లేదా కూలీలతో వ్యవసాయము చేయుట అని అర్థము.

3 వ వివరణ

ఈ విభాగము కార్యము "మైనింగు కార్యము" అనగా ఏదైనా ఖనిజమును త్రవ్వి తీయు నిమిత్తము జరుపు ఏదైన కార్యము అని అర్థము.

## 11 ఈ చట్టము క్రింద బకాయిలను చెల్లించు పద్ధతి.

ఈ చట్టము క్రింద చెల్లించ వలసిన ప్రతి మొత్తమును చెల్లింపు చేయవలసిన విలువకు ట్రెజరీ చలానులను లైసెన్సింగు అధికారికి ఇచ్చుటద్వారా లేదా నిర్ణయింపబడు తదితర విధముగా చెల్లింపు చేయవలెను.

## 12. అప్పీలు

(ఏ) 6 వ విభాగము క్రింద చేయబడిన విధింపు ఉత్తరువు ద్వారా లేదా, లేదా

(బి) 8 వ విభాగము క్రింద పట్టుకొనుట ద్వారా

నష్టపడిన ఏ వ్యక్తియైనను సందర్భానుసారము విధింపు ఉత్తరువును తనకు అందజేసిన తేదీనుండి లేదా పట్టుకొనిన తేదీనుండి ముప్పది దినముల కాలపరిమితిలోపల నిర్ణయింప బడునట్టి అధికారి నిర్ణయింప బడు విధమున అట్టి రుసుమును చెల్లించిన మీదట అప్పీలు చేసుకొనవచ్చును.

## 13. సదుద్దేశముతో జరిపిన కార్యములకు రక్షణ

ఈ చట్టము క్రింద లేదా దాని ననుసరించి చేయబడిన నియమావళి క్రింద సదుద్దేశముతో చేసిన, చేయుటకు ఉద్దేశించిన ఏపని కైనను ఏ వ్యక్తిపై గాని ఎట్టి దావాను అభియోగమును లేక తదితర చట్టబద్ధమైన ప్రొసీడింగులు తీసుకొని రాకూడదు.

## 14. నేరముల విచారణ

సెకండుక్లాసు మేజస్ట్రేటు కోర్టుకు తక్కువయి యుండు ఏ కోర్టుగాని ఈ చట్టము క్రింద శిక్షింపదగి యుండు ఎట్టి నేరమును గాని విచారణ చేయకూడదు.

## 15. కొన్ని కేసులలో కార్యవిధానము

(1) ఒక అధికారి మోటారుబండిని ఆపవలసినదిగా కోరినప్పుడు బుద్ధిపూర్వకముగా ఆ బండిని ఆ పని సందర్భములో 1 వ ఉప విభాగము క్రింద లేదా 5 వ విభాగము 2 వ ఉప విభాగము క్రింద శిక్షింపదగియుండు నేరమును విచారణకు స్వీకరించు కోర్టు నిందితునకు అందజేయు సమనులలో, ఆ వ్యక్తి

(ఏ) స్వయముగా కాకుండా ప్లీడరు ద్వారా హాజరు కావచ్చునని, లేదా;

(బి) నేరమును విచారించుటకు నిశ్చయించిన తేదీకి ముందుగా నిర్దేశింపబడిన తేదీనాటికి నేరమును ఒప్పుకొనుచు కోర్టుకు రిజిష్టరు ఉత్తరము వ్రాసి, కోర్టు నిర్దేశించునట్టి విధముగా ఏబది రూపాయలకు మించనట్టి మొత్తమును కోర్టుకు కట్టవచ్చునని

తెలుపవచ్చును.

నిందితుడైన వ్యక్తి నేరమును ఒప్పుకుని కోర్టు నిర్దేశించునట్టి మొత్తమును కట్టివేసినచో ఆ నేరమునకు సంబంధించి అటుపై ఎట్టి ప్రొసీడింగులనుగాని ఆ వ్యక్తిపై తీసుకొనిరాగూడదు

## 16. నియమములను చేయుటకు అధికారము—

(1) ఈ చట్టముయొక్క కార్యములనన్నిటినిగాని, కొన్నిటినిగాని నిర్వర్తించుటకు ప్రభుత్వమువారు ప్రకటనద్వారా నియమములను చేయవచ్చును.

(2) (1) వ ఉపవిభాగముక్రింద చేయబడిన ఏదైన నియమము, దానిఉల్లంఘన ఏబదిరూపాయలవరకు జరిమానాతో శిక్షింపబడతగియుండవలెనని నిబంధించవచ్చును.

(3) ఈ విభాగముక్రింద చేసిన ప్రతి నియమము, అదిచేయబడిన వెంటనే శాసనమండలి సమావేశములో వున్నచో, దాని ప్రతిసభయెదుట వుంచబడవలెను. దాని శాసనమండలి సమావేశములో లేనిచో ఆ తరువాత వెనువెంటనే జరుగు సమావేశములో అట్లు వుంచబడవలెను. ఒకే సమావేశములోగాని, వరుసగావచ్చు రెండు సమావేశములలోగాని చేరియుండెడి పదునాల్గు దినముల కాలపరిమితివరకు ఆ విధముగా ఉంచబడవలెను. అట్లువుంచబడిన సమావేశము లేదా అటుతరువాత వెనువెంటనే జరుగు సమావేశము పూర్తిఅగుటకు పూర్వము ఉభయసభలను నియమములో యేదైనమార్పు చేయుటకు లేదా యేదయినా నియమమును రద్దుచేయుటకు అంగీకరించునెడల ఆ నియమము సందర్భమును బట్టి అటుపై అట్లు మార్చబడిన రూపములో అమలులోనికి రావలెను. లేదా అట్లు రద్దుకావలెను. అయితే అట్టి మార్పు లేక రద్దు ఆ నియమము క్రింద ఇదివరకు జరిపిన యేదైనా కార్యము యొక్క చెల్లుబడికి భంగకరముగాఉండకూడదు.

## 17. షెడ్యూళ్ళను సవరించు అధికారము :—

(1) ప్రభుత్వము వారు, ఉత్తరువు ద్వారా షెడ్యూళ్ళను సవరించవచ్చును.

(2) (1) వ ఉపవిభాగముక్రింద చేయుట కుద్దేశింపబడిన ఏదయిన ఉత్తరువుయొక్క ముసాయిదాను రాష్ట్రశాసనసభసమక్షమున ఉంచవలెను. ఏ విధమైన మార్పు లేదా చేర్పు లేకుండగా గాని, యేదైన మార్పు లేక చేర్పుతో గాని

శాసనసభ మునాయిదాను ఆమోదించిననే తప్ప ఆ ఉత్తరువుచేయబడకూడదు ఉత్తరువు ఆమోదము పొందినతర్వాత, అది ఏ నమూనాలో ఆమోదించబడినదో ఆ నమూనాలో చేయబడవచ్చును. ఆ విధముగా చేయబడినమీదట అది ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రచురింపబడవలెను.

(3) ఒక షెడ్యూలు ఆ విధముగా సవరించబడినప్పుడు ఈ చట్టములో ఆ షెడ్యూలుకు సంబంధించిన యెట్టి ప్రస్తావననైనను, ఆ విధముగా సవరింపబడినట్టి షెడ్యూలుకు సంబంధించిన ప్రస్తావనగా భావింపబడవలెను.

(18) రద్దులు, మినహాయింపులు:- ఈక్రింది చట్టములు యిందుమూలముగా రద్దుచేయబడినవి.

(ఎ) 1931, ఆంధ్రప్రదేశ (ఆంధ్రప్రాంతపు) మోటారుబండ్ల పన్నుచట్టము

(బి) 1955, ఆంధ్ర ప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) మోటారుబండ్ల పన్నుచట్టము.

(సి) 1952, ఆంధ్రప్రదేశ మోటారుబండ్ల (ప్రయాణీకుల సరకులపన్ను) చట్టము.

అయితే అట్టిరద్దు సదరు చట్టములయొక్క గాని, వాటిక్రింద ఇదివరకే పొందిన, సంక్రమించిన లేదా యేర్పడిన ఏదైన హక్కు, అధికారము, విధి లేక బాధ్యతయొక్క పూర్వపు అములును మార్చకూడదు. దానికి లోబడి, సదరు చట్టమువలన లేదా వాటిక్రింద లభ్యమైన అధికారములను పురస్కరించుకొని (ఏదైన నియామకము, ప్రకటన, నోటీసు, ఉత్తరువు, నియమము, నమూనా, సర్టిఫికెటు, లైసెన్సు లేక పర్మిటుతోసహా) జరిపిన యేదయినపని, లేక తీసికొనిన ఏదైన చర్య, ఆ విధముగా పని జరుపబడిన లేక చర్యతీసుకొనబడిన తేదీన ఈచట్టము అమలులోవుండియున్న యెట్లోఅట్లే, ఈ చట్టము వలన లేక ఈ చట్టముక్రింద లభ్యమైన అధికారములను పురస్కరించుకొని జరుపబడినట్లు లేదా తీసుకొనబడినట్లు భావించబడవలెను. ఈ చట్టము ప్రారంభసమయమున పన్ను బకాయిలు, చెల్లింప వలసిన యితరమొత్తము లన్నియు, అవి ఈ చట్టముక్రింద బకాయి పడియున్నట్లే వసూలు చేయబడవచ్చును.

19. చిక్కులను తొలగించుటకు అధికారము

ఈ చట్టము ప్రారంభమగుటకు సద్యఃపూర్వము అమలునందున్న చట్టముల తద్విధమైన నిబంధనలనుండి ఈ చట్టముయొక్క నిబంధనలకు మార్చుట ఫలితముగా సదరు నిబంధనలను అమలు పరుచుటలో లేదా యితరవిధముగా ఏదయినా చిక్కు యేర్పడినయెడల, ప్రభుత్వమువారు ఆ చిక్కును తొలగించుటకు తమకు అవసరములేదా ఆవశ్యకము అని తోచువిధముగా ఈ చట్టముయొక్క కార్యములకు భంగము కలుగకుండ ఆంధ్రప్రదేశ గెజెటులో ముందుగా ప్రచురింపబడిన మీదట ఉత్తరువుద్వారా నిబంధనలను చేయవచ్చును.



సింగిల్ పాయింట్ టాక్సేషన్ ఏర్పాట్లు చేస్తూ మద్రాసు ప్రభుత్వం రాష్ట్రాంతర రూట్ల పై రవాణాసౌకర్యాన్ని పెంచదలచి జారీచేసిన ఆర్డరులో ప్రయాణీకుల పైన, వస్తువుల పైన అదనంగావసూలుచేసే పన్నువిషయంలోజోక్యం కల్పించుకోని కారణంగా క్వార్టరుకు సుమారు 3 లక్షల ఆదాయాన్ని కోలుపోయింది.



# నీటిలో నిటారుగా నిలబడే పరిశోధక నౌక

అమెరికాలో సముద్రగర్భ పరిశోధనలకోసం తమాషాగావుండే ఒకనౌకను నిర్మించారు. పసిఫిక్ మహాసముద్రంలో జలగర్భంలోని శబ్దతరంగాల పరిశోధనలకు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ శాస్త్రజ్ఞులు దానిని ఉపయోగిస్తున్నారు. మహాసముద్రంలో ఇంచుమించు కదలకుండా ఒకేచోట నిటారుగానిలబడివుండే ఆ నౌకలో వారు ఒక్కొక్కసారి రెండువారాలపాటువుండి పరిశీలనలు గావిస్తారు.

ఆ నౌకకు ఫ్లిప్ (ఫ్లోటింగ్ ఇన్‌స్ట్రుమెంటు ప్లాట్‌ఫారం) అని పేరుపెట్టారు. అమెరికా నౌకా పరిశోధన కార్యాలయ అధ్వర్యాన జరిగే ఆ కార్యక్రమంలో ఉపయోగించే హైడ్రోఫోనులు ఎలక్ట్రానిక్ పరికరాలు, ప్రయోగాలకు పనికి వచ్చే పనిముట్లను అందు ఏర్పాటుచేశారు.

మహాసముద్రాలలో పయనించే పెద్ద నౌక (టగ్) ఫ్లిప్పును పరిశోధనలు జరుపవలసిన స్థలానికి తీసుకొనివెళ్ళుతుంది. అక్కడ దాని వెనుక భాగాన్ని సముద్రజలంతో నింపుతారు. అప్పుడు దాని ముందుభాగం నిటారుగా పైకిలేస్తుంది. నాలుగు అంతస్థులుగల ఆ భాగంలో నలుగురు వ్యక్తులకు నివాససౌకర్యం, ఒక "వెట్ లేబరేటరీ" ఇంజనుగది వుంటవి.

నీళ్ళు జొరబడని స్తంభాలవంటి గొట్టాల్లో నీటిమట్టానికి 150అడుగులక్రిందకు సిబ్బందివెళ్ళ వీలవుతుంది.

355 అడుగులపొడవు, 600 టన్నుల బరువుగల ఫ్లిప్ సన్నంగా వున్న "నడుం" వద్ద 12½ అడుగుల వెడల్పు మాత్రమే ఉంటుంది.

నౌకాదళ శాస్త్రవేత్తలు, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం తాలూకు స్క్రిప్స్ సముద్రగర్భశాస్త్రసంస్థ పరిశోధకులు,ఆనౌకను రూపొందించారు. పోర్ట్‌ల్యాండ్ (ఒరెగాన్) లో ఆనౌక విడిభాగాలను నిర్మించి ఆతర్వాత అతికారు.

ప్రస్తుత పరిశోధనలతర్వాత అలల కదలికలు, అంతర్గత తరంగాలు, సాగరజీవశాస్త్రం మొదలైనవాటి పరిశోధనలకు ఫ్లిప్‌ను ఉపయోగిస్తారు. అల్లకల్లోలంగావున్న సముద్రాల్లో మామూలు నౌకలవలె అటూఇటూ కదలకుండా ఫ్లిప్ స్థిరంగా నిలబడి పరిశోధనలకు ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

తమ పరిశోధనలు అయినతర్వాత, శాస్త్రవేత్తలు ఫ్లిప్పును తీసుకువచ్చిన టగ్‌నౌకలోనికి వెళ్తారు. ఎక్కువవత్తిడిగల గాలితో బాలస్టు ట్యాంకుల్లోకి నీరును బయటికి కొట్టేస్తారు. అడ్డంగా వున్న ఫ్లిప్‌నౌక వెన్నుకు జత పరచిన 70 టన్నుల కాంక్రీటువలన కుడి భాగం పైకిలేచి మామూలు నౌకగా సమధరాతలంగా తిరుగుతుంది. దానిని పరిశోధనలుజరుపవలసిన మరొక ప్రదేశానికి లాగుకొని వెళ్తారు.

దానిలో శీతలీకరణకూ, తదితర యంత్రాలు వగయిరా పనిచేయటానికి కావలసిన విద్యుచ్ఛక్తిని రెండు డీసెల్ జనరేటర్లు ఉత్పత్తిచేస్తవి.

టగ్‌నౌకనుంచి సముద్రగర్భంలోనికి దించిన శబ్దగ్రాహి (సౌండ్ మేకరు) నుంచివచ్చే శబ్దాలు వినేటందుకు ఫ్లిప్పులో అనేక చోట్ల హైడ్రోఫోనులు ఏర్పాటుచేశారు.

ఫ్లిప్పులోని శాస్త్రజ్ఞులు సముద్రగర్భంలో శబ్దాలను కొలుస్తూ, అదే సమయంలో సముద్రంలో పయనించే తదితర నౌకలతో రాడార్ రేడియో దృశ్యయంత్రాలద్వారా సంబంధం పెట్టుకొనదగినసదుపాయాలుకూడాకల్పించారు.

# వ్యాపారాభివృద్ధికి అనువుగా లారీలకు రాష్ట్రవ్యాపిత పర్మిట్లు.

## అనంతపురం సభలో రాష్ట్ర మోటారు రవాణా ఆపరేటర్ల విజ్ఞప్తి.

## రాజధానినుంచి జిల్లా కేంద్రాలకు, బస్సుసర్వీసులకు సూచన.

**ఆంధ్రప్రదేశ్‌లో** రైలుమార్గాలు తక్కువగా వున్నందున, రాష్ట్రంలో వర్తక వాణిజ్యాభివృద్ధికిగాను లారీ సర్వీసులను ప్రోత్సహించాలని. ఇందువలన రైల్వేలకు పోటీఅనే సమస్య వుండదని. ఇందుకుగాను రాష్ట్రవ్యాపిత పర్మిట్లను లారీలకు ఇవ్వాలని రాష్ట్రమోటారు రవాణా ఆపరేటర్ల 13వ మహాసభలో రాష్ట్ర మోటారుయూనియనుల కాంగ్రెసు కార్యదర్శి శ్రీ వై. రామబ్రహ్మం ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

బస్సు సర్వీసుల జాతీయీకరణ పేరుతో స్వాష్టవంగా నడిపే చిన్న ఆపరేటర్ల సర్వీసులను నిర్మూలించడంకంటె హైదరాబాదనుంచి తిరుపతి, మద్రాసు, అనంతపురం, బెంగుళూరు కడపవంటి దూరప్రాంతాలకు ఎక్స్‌ప్రెస్, డీలక్సు బస్సులు నడిపినప్పుడు రోడ్డు రవాణా కార్పొరేషనుకు మంచిలాభం రాగలదని ప్రయాణీకులకు సౌకర్యం ఉంటుందని కూడా ఆయన సూచించారు. జాతీయంచేసిన బస్సు సర్వీసులు పటిష్ఠంగా నడపడానికిగాను రోడ్డు రవాణాసంస్థను వికేంద్రీకరణ చేసి, రెండు, మూడు జిల్లాలకు ఒక సహకార రోడ్డు రవాణా కార్పొరేషను ఏర్పాటు చేయడం మంచిది కాగలదనికూడా చెప్పారు. శ్రీ రామబ్రహ్మం తమ ప్రసంగంలో ఇంకా యిలా అన్నారు:-

"మద్రాసు, మహారాష్ట్ర రాష్ట్రములతో పోల్చినప్పుడు మన రాష్ట్రములో లారీలు ఎక్కువగా ఉన్నవి. కారణము రోడ్లు తక్కువ. పన్నులు ఎక్కువ. ప్రభుత్వ విధానములో స్వల్ప మార్పులు కావలసియున్నవి. ఆంధ్ర రాష్ట్రములో లారీలకు మొన్నమొన్నటివరకూ ఒకటి రెండు జిల్లాల పర్మిట్లే వున్నవి. పది సంవత్సరములనుంచి మేము రాష్ట్రవ్యాపితపు (స్టేటు) పర్మిట్లు ఇవ్వవలసినదిగ ఆందోళన చేస్తున్నాము. ఇక్కడ రైల్వే లైనులు బహు కొద్ది కాబట్టి వాటికి పోటీ వుండేదిలేదు. కాని, ప్రభుత్వమువారు అలా పర్మిట్లు యివ్వలేదు. నాల్గు అయిదు నెలలక్రింద కాబోలు జోనల్ పర్మిట్లకు అంగీకరించినారు. రాష్ట్ర వ్యాపిత పర్మిట్లు యిస్తేనేగాని ఈలారీలకు ఉపయోగము లేదు. దీనివలన రాష్ట్రప్రభుత్వపు ఆదాయము పెరుగుతుంది. కాని, నష్టము ఏమీ లేదు. శ్రీ కామరాజునాడార్ ఈ విషయమై శ్రద్ధ తీసుకొని రాష్ట్రవ్యాపిత పర్మిట్లను మద్రాసు రాష్ట్రములో అన్ని లారీలకు యిచ్చుటకు సమ్మతించిరి. ఆంధ్రరాష్ట్రములో అన్ని లారీ

లకుకూడా ఇలా పర్మిట్లు ఇవ్వవలసినదిగ కోరు చున్నాము.

### అంతరాష్ట్రీయ సర్వీసులు:

"ఆంధ్ర-మద్రాసు రాష్ట్రాలమధ్య ఎక్కువ అంతరాష్ట్రీయ రవాణా వ్యాపారము లారీల మీదనే జరుగుతుంది. ఆంధ్ర డెల్టా జిల్లాల నుంచి 5, 6 లక్షల టన్నుల బియ్యం మద్రాస్ కేరళ రాష్ట్రాలకు రవాణా అవుతుంది. నెల్లూరు నుంచి మైకా, గుంటూరుజిల్లానుంచి పొగాకు, కడపనుంచి పసుపు, ధాన్యాలూ చిత్తూరునుంచి ఫారెస్టు ప్రొడక్ట్సులూ, పరిసర జిల్లాలనుంచి ఇనపరాయి, ప్రైరటీసు, ఖనిజాలు మద్రాసు పోర్టుకు రవాణా అవుతాయి. ఆంధ్రజిల్లాలలోని లారీలద్వారా యీ సరుకులు రవాణా అవు తాయి. ఈ సరుకుల ఉత్పత్తిదారులు మద్రాసుకు ఆర్డరు యిచ్చి, లారీలు తెప్పించుకొనరు. అది నష్టంకూడాను. మద్రాసు ట్రాన్సుపోర్టు డిపార్టుమెంటువారు ఆంధ్రలారీలకు మద్రాసు వచ్చుటకు పర్మిట్లు విరివిగా యివ్వకపోవుట శోచనీయము. మద్రాసు-ఆంధ్ర ప్రభుత్వాలు అంగీకరించిన ఎగ్రిమెంటులోవున్న మేరకుకూడా మద్రాసు ప్రభుత్వమువారు సెకండరీ పర్మిట్లు యిచ్చుటలేదు. మద్రాసుపర్మిట్లు లేకపోవుట వలన, రాష్ట్రపు రవాణావలన ఆదాయము పడి పోవుచున్నది. ఈ విధముగా ఆంధ్ర-ఒరిస్సాల మధ్య రెండు సంవత్సరములనుంచీ పేచీలుగనే వున్నది. విశాఖపట్నం రేవు నుంచి ఒరిస్సాకుఎక్కువసరుకులు వెడతాయి. ఒరిస్సానుంచి ఆంధ్రకువచ్చే రవాణా సరుకులు తక్కువ కావునఆంధ్రలోని లారీలకు ఎక్కువగా ఒరిస్సా కౌంటర్ సిగ్నేచర్ పర్మిట్లు కావాలి. రెండు సంవత్సరాలనుంచి పెండింగులోనున్న ఈ సమస్యనుకూడా త్వరగా తేల్చగలందులకు ప్రభుత్వాన్ని కోరుచున్నాను. ఆంధ్ర-మైసూరుల మధ్యకూడా రవాణాశాఖ చిక్కులు ఎక్కువగా ఉన్నాయి. ఆంధ్ర-బొంబాయి పర్మిట్లుగల బండ్లు మైసూరులోని ముప్పది మైళ్ళ రోడ్డు గుండా వెళ్ళవలెను. అందుకుగాను మైసూరు ప్రభుత్వమువారు పూర్తి టాక్సును వసూలు చేస్తున్నారు. అది అన్యాయము. నష్టము కూడాను. మైసూరు రాష్ట్రప్రభుత్వమువారికి పరిహారం యిచ్చి యీ ముప్పయి మైళ్ళ రోడ్డు ఆంధ్ర ప్రభుత్వము తీసుకొనటమో, మరే వుపాయమో చేయవలెనని ప్రభుత్వాన్ని కోరుచున్నాను. ఈ అంతరాష్ట్రీయ రవాణా సౌకర్యాలు కలిగిస్తే, రాష్ట్రములో లారీల సంఖ్య రాబోవు 5, 6 సంవత్సరాలలో రెట్టింపు పెరిగి ప్రభుత్వానికి 60, 70లక్షల రూపాయలకుపైగా సం॥కు రవాణావలన ఆదాయాన్ని చేకూర్చుననుటకు సందేహాము లేదు.

### రోడ్ల పరిస్థితి

ఆంధ్రరాష్ట్రములోని రోడ్లు మైలేజి చాలా తక్కువ 100 చ. మైళ్ళకు 18 లేక 20 మైళ్లు నిడివి రోడ్లు వున్నవి. మన పొరుగునవున్న మద్రాసులో 100 కి 25 మైళ్ళు రోడ్లనిడివి వున్నవి. రోడ్ల మైలేజి తక్కువగ వుండుటవలననే బస్సులు. లారీల ట్రాన్సుపోర్టు సర్వీసులు మద్రాసు, మహారాష్ట్ర, పంజాబు, పశ్చిమ బెంగాలుకన్న చాలా తక్కువ.

ఈ రాష్ట్రములో నాగార్జునసాగర్ ప్రాజెక్టు కాల్వక్రింద 25. 30 లక్షల టన్నుల ధాన్యము పండునని [illegible] మిగులు పదిలక్షలు టన్నుల ధాన్యాన్ని [illegible] ప్రాంతాలకు రవాణా చెయ్య

వలసి వస్తుంది. రైల్వేలైను సరిపైనదిలేదు. రోడ్లు అయినను ప్రభుత్వమువారు వెంటనే నిర్మాణము చెయ్యవలెను. రోడ్డు ట్రాన్సుపోర్టు సర్వీసులవలన వచ్చే టాక్సులూ, బెటర్ మెంటు టాక్సుల వసూళ్లు (ఆయా డిపార్టుమెంటుల నిర్వహణ ఖర్చులుపోను) మిగతా సొమ్మును ఫక్తు రోడ్ల నిర్మాణమునకే అయిదు సంవత్సరముల పాటు ఖర్చుచేసినచో, రాష్ట్రములోని అన్ని గ్రామములకు సువిశాలమైన రోడ్లు యేర్పడగలవు. డాక్టర్ లోకనాథన్ కమిటీవారుకూడా రాష్ట్రములో రోడ్ల అభివృద్ధి యెంతైనా అవసరం అని వారి రిపోర్టులో చెప్పినారు. పంచాయతీ సమితులూ జిల్లా పరిషత్తులు ఈ రోడ్ల నిర్మాణపు బృహత్ ప్రణాళికకు యెంతైనా తోడ్పడగలవు. జర్మనీలోని ఆటోబాన్ వలె, అమెరికాలో యెక్సుప్రెస్ వేస్ వలె, శ్రీకాకుళం నుంచి అనంతపురంవరకు ఒక సువిశాలమైన రోడ్డు అయినా ప్రభుత్వము నిర్మించాలి అని కోరుచున్నాను. పంచాయతీ సమితులలోని గ్రామాలను పంచాయతీ కార్యస్థానమునకూ, సమితుల కార్యస్థానములను, జిల్లాపరిషత్ కార్యస్థానమునకూ, జిల్లాపరిషత్ ల ముఖ్యపట్టణములను రాష్ట్ర ముఖ్యపట్టణమునకు కలుపుతూ, రోడ్ల నిర్మాణము రాష్ట్రప్రభుత్వము చేయవలెను. అన్ని రోడ్లూ హైదరాబాదుకే చేరేటట్టుగ చేయవలెనని కోరుచున్నాను.

## మోటారుబండ్ల టాక్సు

అయిదు, ఆరు సంవత్సరములనుంచి మా సంఘమువారు చేయుచున్న ఆందోళన ఫలితముగ ఈనాడు సింగిల్ పాయింటు టాక్సును అనుకూలముగ క్రిందటి శాసనసభలో మూడు నాలుగు చట్టాలను సంఘటితపరచి, ఒక చట్టము చేసినందులకు రవాణా మంత్రికి మా అభివందనములు. ఈ టాక్సు నిర్ణయములో మేము మెమొరాండం యిచ్చితిమి. మనము ఒక నిర్ణయానికి వద్దాం అని వారు చెప్పిరి. మేమందరము మంత్రి గారితోసహా సమావేశమై సంప్రదించి కొన్ని నిర్ణయాలకు వచ్చితిమి. ఆ నిర్ణయాలను అమలు పరచవలసినదిగా మరొకసారి కోరుచున్నాము.

1. 130 మైళ్ళలోపు మైలేజి ప్రతిదినమూ ఆపరేట్ చేసే బస్సులకు సీటు 1కి మూడునెలలకు 60 రూపాయలూ, ఆ పై వాటికి రు. 67-50 నపై. నిర్ణయించుటకున్నూ,

2. ఈ మోటారు టాక్సు సింగిల్ పాయింటు అగుటవలన, మూడు నెలలకు అడ్వాన్సు పేమెంటు 3 లేక 3½ వేల రూపాయల మొత్తం అవుతుంది కాబట్టి, మూడు నెలకు బదులుగ ప్రతి నెలలోను అడ్వాన్సుగా 15 వ తేదీలోగా టాక్సులు చెల్లించే ఏర్పాటు చేయాలి.

3. స్పేరు బస్సులు టాక్సుచెల్లించిన రూటు బస్సుల స్థానములో మాత్రమే తిరుగును గావున వాటికి టాక్సు మినహాయింపులు, వీటికి యాక్టులు మార్చవలసినఅవసరంలేదు. హైదరాబాదులో జరిగిన సంప్రదింపులలో మంత్రి వారి అనుకూలతను చూపిరి. ఇంతవరకు ఏ నిర్ణయమూ జరుగలేదు కావున మరల మనవి చేసుకొనుచున్నాను.

మన రాష్ట్రములో ప్రత్యక్షపరోక్ష పన్నుల ద్వారా కేంద్రరాష్ట్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వములకు బస్సు 1 కి రు. 23, 24 వేల రూపాయలూ, లారీ 1 కి రూ. 9000 లు పన్నుల క్రింద సంవత్సరమునకు చెల్లించుచున్నారు. రాబోవు బడ్జెట్లులో ఇంకనూ ఎక్కువ పన్నుల

ఈ ట్రాన్సుపోర్టు సర్వీసులమీద వేయవద్దు అని ప్రభుత్వమును కోరుచున్నాను.

బస్సు సర్వీసులు :

భారత దేశములోని రాష్ట్రాలు అన్నింటి లోనూ చారిత్రిక విషయాలలో అగ్రస్థానము ఆంధ్రకే. భూదాన వుద్యమమునకు మన రాష్ట్రమే నాంది. ఇది గర్వించవలసిన విషయము. మన బస్సుల జాతీయ ప్రారంభము 1932 సంవత్సరంలో. ఇప్పుడు ఇది ముప్పై ఏండ్ల ప్రౌఢకన్య. మిలిటరీ సర్వీసులలో అత్యున్నత పదవిలో అనుభవం సంపాదించిన గౌ. కటారిగారి హస్తగతము అయింది. వారు ఏమి చేసినా మాకు సంతోషమే. రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పోరేషనువారు చిన్న చిన్న బస్సుల ఆపరేటర్లను, సౌష్టవముగ నడుపబడే సర్వీసులను నిర్మూలించుటకు బదులు, వారి అందరి సర్వీసుల సహకారములతో హైదరాబాదు - తిరుపతి, హైదరాబాద్ - మద్రాసు, హైదరాబాదు - మైసూరు, బెంగుళూరు- హైదరాబాదు, అనంతపురం- హైదరాబాదు - కడప, మారపు రూట్సుమీద యక్సుప్రెస్ డీలక్సు బస్సులు నడిపితే కార్పోరేషన్ కు ఎక్కువలాభము చేకూర్చగలుదురు అని సవినయముగ కార్పోరేషను వారికి,ప్రభుత్వము వారికి విన్నవించుకొంటున్నాము.

ఈ పరిస్థితులలో అనుభవముగల ట్రాన్సుపోర్టు ఆపరేటర్లు వారి స్థానిక సర్వీసుల ద్వారా కార్పోరేషనుకు లాభములు సంపాదించి పెట్టెదరు. వారి పూర్తి సహకారములూ కార్పోరేషను వారికి ఉండగలవని ఆశించుచున్నాను. వేలాది బస్సులు వేలకు వేలు కార్మికులనూ ఒకేసంస్థ మేనేజిమెంటు చెయ్యటం సులభసాధ్యముకాదు. దీని వలన లాభముల కంటే నష్టములే ఎక్కువ ఉండవచ్చును. రెండు మూడు జిల్లాలకు ఒక్కొక్క కో - ఆపరేటివ్ ట్రాన్సుపోర్టు కార్పొరేషనును ఏర్పాటు చేసి, బస్సు రవాణా వికేంద్రీకరణ చేసినచో, ఎడ్మినిస్ట్రేటివ్ సౌకర్యాలూ, సర్వీసుల సౌష్టవమూ కలిగి రాష్ట్ర ప్రభుత్వములకు ఎక్కువ లాభములు కలుగును. ఆదర్శప్రాయమైన కో - ఆపరేటివు ట్రాన్సుపోర్టుకార్పొరేషన్లు మన ఆంధ్ర రాష్ట్రములో ఏర్పాటును ప్రభుత్వము వారు చేయవలెను. ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వము రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పరేషను చట్టం సవరణలు తెచ్చుటకు వెంటనే సంకల్పించినది. సువిశాలమైన ఆంధ్రప్రదేశ్ లో నాలుగుకోట్ల ప్రజా సామాన్యమునకు ఆదర్శప్రాయమైన రోడ్డు రవాణా సౌకర్యాలను ప్రభుత్వమువారు కలుగజేసెదరని ఆశించుచున్నాము.''

ఈ సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర రవాణా మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి గారికి, సభకు ప్రారంభోత్సవం చేసిన ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి గారికి ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ పి. గోవిందరెడ్డి స్వాగతం చెబుతూ ఇలా అన్నారు :–

"ఏ వ్యాపార మెక్కువ పన్నులను భరింపగలదు అని నిర్ణయించి, ఆయా వ్యాపారముల మీద పన్నుల భారమును సర్దుబాటు చేయుదురనియూ, ఆర్థిక శాస్త్రవేత్తలు కలసి పరిశీలించి నిర్ణయించిన విధానములను ప్రభుత్వము వారు పాటించుటకు విన్నవించుచుంటిమి. ఆంధ్రప్రదేశ్ లోని ట్రాన్సుపోర్టు ఆపరేటర్లూ అంతరమూ ఎల్లప్పుడు
గా సహకరించుచునే యుంటిమి. సహకరింతుము. కేంద్ర ప్రభుత్వమున రాదాయపు పన్ను- దిగు

మరి పన్నులు, సుంకములు, రాష్ట్ర ప్రభుత్వము వేసే పన్నులూ, మునిసిపాలిటీలకు వృత్తి, ఆస్తి పన్నులూ, స్థానిక సంస్థలకు పంచాయితీల పన్నులూ సక్రమముగా చెల్లించుచునే యున్నాము. మరియు జాతీయరక్షణ నిధికి మా అనంతపురం జిల్లా ట్రాన్స్‌పోర్టు ఆపరేటర్లు అన్ని డిపార్టుమెంటులద్వారా దాదాపు యాభై వేల రూపాయల వరకు విరాళముల విరివిగనిచ్చి యున్నాము. పది సంవత్సరములపాటు మమ్మి ట్లుంచినచో ప్రభుత్వాదాయమున కెన్నటికినీ లోటు రానేరాదని మనవి చేయుచున్నాము. మా స్థానమునవచ్చే కార్పొరేషనువల్ల ప్రభుత్వమునకు లాభముండదని మనవి చేయుచున్నాము. అనుభవముగుబట్టి అభివృద్ధినొందిన దేశాలే ఇందుకు తారాణము పన్నుల భారము తగ్గినచో మోటారుబండ్లు యెక్కువగా పనిచేసి, యెక్కువ రెవిన్యూను ప్రభుత్వమున కెక్కువ ఆదాయమును చేకూర్చగలమని ఆశించుచున్నాము.

## బస్సు సర్వీసులలో లాభాలు

పురపాలక సంఘం జూబ్లీ హాలులో జరిగిన యీ సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ, ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి యిలా అన్నారు:

"మోటారు రవాణా వ్యాపారములో పోటీ వల్లను, అధిక పన్నులవల్లను నష్టము వచ్చుచున్న దనుట నమ్మజాలను. మిగతా వ్యాపారముల కంటే ఇందులో హెచ్చు లాభము వచ్చుచున్న దనుటకు యజమానులు చేయు ఆడంబరముగు ఖర్చులే నిదర్శనము. యజమానులు పదులు నూర్లు లెక్కలేకుండా ఖర్చు పెట్టుచుందురు. ఏ మార్వాడీవద్దనో అప్పుచేసి ఒక బస్సు, లారీనో కొని తంటాలుపడి రూటు సంపాదించుకుంటే అనతికాలంలోనే వారు హెచ్చుగా లాభము పొందగలుగుచున్నారు. ఇది కాదనలేము. సామాన్యపౌరులకూ, ధనవంతులకూ తారతమ్యం మత్యధికముగా నుండుటచే దానిని తగ్గించుటకు సామ్యవాద పద్ధతే తగిన మార్గమని వొక సూత్రం అంగీకరింపబడినది. ఆ ప్రకారం బస్సుల జాతీయము చేయుటకు ఉపక్రమింపబడినది. ఆంధ్రరాష్ట్ర మేర్పడకముందే తెలంగాణాలో, బస్సులు ప్రభుత్వముచే నడుపబడుచున్నవి. ఆంధ్రజిల్లా లన్నింటిలోను రవాణా ఒకేసారి జాతీయము చేయుటకు ద్రవ్యము చాలదు. ఒక్కొక్క జిల్లాకే సుమారు రెండు కోట్లు కావలసివచ్చును. అందుచేత ఒకటి రెండు జిల్లాలు తీసుకొనబడుచున్నవి. 4 ఏండ్లలో అన్ని జిల్లాలలోను జాతీయ మొనర్చుటకు మొదట సంకల్పించితిమిగాని, గోదావరి కృష్ణలపైన బ్రిడ్జీలు ఇంకా కాలేదు ప్రభుత్వాదాయం కూడ చాలదు. కాన ఆరేడు సంవత్సరాలలో నైనా పూర్తి కాగలదని విశ్వసించుచున్నాను. మొదట విజయవాడలో ప్రారంభించినప్పుడు ఆందోళన హెచ్చుగ నుండెను. తర్వాత హైదరాబాదులో రవాణాచూచి కొంత తప్పి పోయెను. ఈసారి కర్నూలుజిల్లా రవాణా జాతీయ మొనర్చబడును. కారణం ప్రక్కనున్న గుంటూరు, మహబూబ్‌నగర్ జిల్లాలలో

అప్పుడే జాతీయమైనవి. కర్నూలు, రాయల సీమకు దారి. కాబట్టి ఈసారి దాని నేరుకొంటిమి. అంతేకాని; ఎవరికో సహాయపడవలెనను వ్యక్తిగత పక్షపాతము వల్లగాదు.

రోడ్ల అభివృద్ధి అవసరమేకాని, పరిమితమైన ప్రభుత్వాదాయముతో ఏది ముందు, ఏది వెనుక అభివృద్ధి చేయవలెనని యోచించి విద్య విద్యుత్తు వ్యవసాయ రంగాలకు ప్రాధాన్యమివ్వబడెను. అందువల్ల రోడ్లకు 5 కోట్లు మాత్రము కేటాయింపబడెను. దీనితో వీలైనన్ని సదుపాయములు చేయబడెను.

పన్నులు, సర్‌ఛార్జీలు కట్టకుండా కోర్టులకు వెళ్ళి లాభంలేదు. అందువల్ల కాలహరణమేగాని, తర్వాత అంతయూ ఒకేసారి వసూలు చేయవలసి వచ్చును. అది చాలా భారమగును. వసూలు చేయుటకు ప్రభుత్వము కఠినచర్యలు తీసుకోవలసివచ్చును. కాని నొప్పి పెట్టకుండా వుండవలెనని కంతుల మేరకు చెల్లించుటకు యేర్పాటు చేయబడినది. తగాదాలు పెంచుకొనకుండా సమరసంగా పోవుట మంచిదని సూచించుచున్నాను. పన్నులు హెచ్చించుటే ప్రభుత్వోద్దేశముకాదు. కంట్రోళ్ళవల్ల వ్యాపారులకు నష్టమేరాదు. తగినంత లాభము ఏర్పాటు చేసియే నిబంధనలు ఏర్పాటు చేయబడును. రైతులకు 300 పర్సంటు పన్నులు హెచ్చింపబడినవి. బీదలకు, ధనవంతులకు వున్న తారతమ్యము తగ్గించుట ముఖ్యమని గమనింపవలెను.

లైసెన్సులు లేకుండా ఇంకా లారీలు నడుపుతున్నట్లు తెలియుచున్నది. దానివల్ల పన్ను తప్పించుకొన జూచుచున్నారు. పన్నులు వసూలుచేసి, ప్రజలమేలుకే వినియోగింపబడుచున్నదనుట తెలుసుకోవలెను. పన్నులు సరిగా చెల్లించునట్లు మీ సంఘము సహకరించ కోరుచున్నాను. మీ కష్టసుఖములు తెలుసుకొనుటకు నాకీ అవకాశమిచ్చినందుకు ధన్యవాదములు." తర్వాత అధ్యక్షుడు శ్రీ గురుమూర్తి గారు సంజీవరెడ్డి నాయకత్వమున రాష్ట్ర పరిపాలన సౌష్టవముగా ప్రజారంజకముగా జరుగగలదనియు, వారి నాయకత్వముపై విశ్వాసముంచి సహకరించవలసినదిగా కోరిరి. రవాణా వ్యవస్థపైననే ఏ ప్రాంతముగాని, పారిశ్రామిక, వ్యవసాయరంగములలోను, తద్వారా ఆర్థికముగా అభివృద్ధి చెందగలదని.

♦♦♦


# రవాణా సమాచార్

ఆంధ్రప్రదేశ్‌నందు తెలుగులో ప్రచురింపబడు ఒకే ఒక రవాణా సమస్యలకు సంబంధించిన మాసపత్రిక.

సంవత్సర చందా రు 3-00
విడిప్రతి- న.పై. 25

ఆంధ్రప్రదేశ్ యందన్ని
"హిగిన్ బాథమ్స్"
రైల్వేబుక్‌స్టాల్సులోను, లోకల్ బుక్‌స్టాల్సులోను దొరకును.

ఏజంట్లులేని ప్రదేశమందుఏజంట్లు కావలెను.

'రవాణా సమాచార్'
విజయవాడ-2,




కంట్రోలు టవర్ లోకూర్చుని మీటనొక్కితే రైలు వ్యాగన్లు ఏ లైన్లమీదకి ఏవైపునకు పోవలసినవి ఆయా లైన్ల మీదకు ఆ వైపునకు పోయి ఆగవలసిన చోట ఆగే ఏర్పాటు మొగల్సరాయ్ రైల్వే మార్షలింగ్ యార్డులో ఏర్పాటు చేశారు. రిటార్డర్ల ఏర్పాటు, హంపింగ్ లైన్ల రైలుకమ్మీలకు అమర్చబడి 37 లైన్ల పైకి రైలు వ్యాగన్లను చేర్చే అవకాశం చేయబడింది. ఈ స్టేషన్ లో మీట నొక్కితే పనిచేసే రైలు పాయింట్లు అమర్చబడ్డాయి. ఇవి ప్రమాదాల నివారణ చర్యలలో సాధించిన అభివృద్ధి అనవచ్చును.

♦ ♦ ♦

పెట్రోలు సరకుల మీద ఎక్సైజు సుంకం ఎక్కువ చేయబడుతున్నది. యంత్రాలపై పన్ను రేటు 15 శాతము నుండి 20 వరకు పెంచబడుతున్నది. అన్ని రకాల దిగుమతి సుంకాలమీద నూటికి 10 వంతులు సర్ ఛార్జి విధింపబడును.

♦ ♦ ♦

ఇక నుండి పోష్టుకార్డు 6 నయాపైసాలు, రిప్లయి పోష్టు కార్డు 12 నయాపైసలు. లోకల్ పోష్టు కార్డులు రద్దుచేయబడతాయి. రిజిష్ట్రేషన్ ఛార్జీలు 50 నయాపైసలు నుండి 55 నయాపైసలకు, అక్నాలెడ్జిమెంటు ఛార్జి 6 నుండి 10 నయాపైలకు పెంచబడుతుంది.

♦ ♦ ♦

అవసరమయితే ఆంధ్రకు ప్రత్యేక రైల్వేమండలాన్ని ఏర్పరచటానికి తన కెట్టి అభ్యంతరము లేదని శ్రీ స్వర్ణసింగ్ చెప్పారు. కాని ప్రస్తుత దేశ అత్యవసర పరిస్థితుల దృష్ట్యా వీలుకలగదన్నారు.

♦ ♦ ♦

రైల్వేల అధీనంలో ఖాళీగాఉన్న నేల 7688 యకరాలను సేద్యం కొరకు చిన్న రైతులకు, వ్యవసాయిక కూలీలకు కేటాయించవలసిందిగా రాష్ట్రప్రభుత్వాలను కోరినట్లు శ్రీ షానవాజ్ ఖాన్ వెల్లడిచేశారు.

♦ ♦ ♦

యుద్ధము వస్తే సైన్యంలో పనిచేయటానికి పనికి వచ్చేందుకు ఉత్సాహంగల యువకులకు మోటారు డ్రయివింగ్ శిక్షణ తరగతులను హైదరాబాదులో ప్రారంభించారు. ... గే విజయవాడ, కర్నూలు పట్టణాలలో అవకాశాన్ని ఏర్పరచ తలపెట్టారు. అంతేగాక లోగడనుండి అనుసరణలో ఉన్న రూల్సు ప్రకారం ముందుగా లైటు లైసెన్సు యిచ్చి ఆ వెనుక 3 సంవత్సరాల అనుభవం వున్నట్లు చెప్పగలిగే వారికి హెవీ బండ్లు తోలేందుకు అవకాశాన్ని కలుగజేయుటం ప్రస్తుతానికి సడలించి మొదటిసారిగనే సామర్థ్యము ప్రదర్శింపగలిగే వారికి హెవీ బండ్ల తోలకాన్ని గుర్తించి లైసెన్సులు రాష్ట్రమంతా యిచ్చే సూచనలు చేశారు.

♦ ♦ ♦

స్కూటర్ల ఉత్పత్తి తగ్గింపబడిందని,ఆటోరిక్షాల సరఫరాపై గూడా ప్రభుత్వం కంట్రోలు అమలు జరపగలదని కేంద్ర మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం చెప్పారు. బ్లాక ... ట్

అమ్మకాల వలన స్కూటర్ల నూగోలు డిమాండు పెరిగిందని వెల్లడించారు

♦ ♦ ♦

రైలు ప్రమాదాల నివారణకు పని వారి అలక్ష్యం తొలగింపబడాలని, లేక వారి ప్రమేయం తొలగింపబడాలని శ్రీ కుంజ్రూ కమిటీ వాదుశలవిచ్చారు. రైల్వే "వేమెంట" ఎన్నికకాల ముందే శాస్త్రీయమైన పరిశీలన వల్ల వారిలో అశ్రద్ధ కలుగదనే నిర్ణయం కుదుర్చుకొన్న వెనుక వారిని ఆపనిలో నియమించటం ముఖ్యమన్నారు. వారికి తగినంత శిక్షణ గరపటంవలన గూడ అనుభవ పూర్వకమైన ధోరణి (లేక) అలవాటు వలన వారు పనులయందు అప్రమత్తులై వుండగలరన్నారు. ప్రమాద నివారణోద్యమాన్ని సంక్షిప్తంగా తేలికభాషలో అర్థమయ్యే పద్ధతిని తయారు చేసిన చేతిరూల్సు పుస్తకాల ప్రచురణ, బోధనలాంటి కార్యక్రమం అవసరమన్నారు. అంతేగాక రైలింజన్లకు స్పీడో మీటర్లు అమర్చబడటం వలన డ్రైవర్లు తెలిసికొని వాటిని కావలసిన స్పీడులో నడుపుకోగలరని చెప్పారు.

♦ ♦ ♦

విలాస యాత్రికుల సంఖ్య నానాటికి తగ్గిపోవటాన్ని శ్రీ జగజ్జీవన్ రాం విమర్శించారు. 1959 లో 1 లక్ష 40 వేల యాత్రికులు వచ్చారు. రానురాను విదేశయాత్రికులు తగ్గిపోయారు. నేటి ప్రపంచ పరిస్థితులేగాక, ముఖ్యంగా మన దేశంలో హోటల్ నడిపేవారు, రవాణా ఏర్పరచేవారు, షాపు కీపర్లు, గైడ్లు మున్నగువారు చేసే అక్రమ విధానములు తగ్గింపబడాలని, కేవలం ప్రభుత్వ ప్రమేయంక్రిందగాక ప్రయివేటు సంస్థలవారు, రవాణా పరిశ్రమల వారు యీ కార్యక్రమాన్ని కొనసాగిస్తూ ప్రభుత్వసహకారంతో వృద్ధిచేయుటం దేశ సౌభాగ్యాన్ని పెంపొందించటం అవుతుందన్నారు.

♦ ♦ ♦

బొంబాయి గవర్నమెంటు ఆర్డరు వలన మహారాష్ట్ర ప్రభుత్వం తమస్టేటులో తిరిగే లారీలు లో ... 9 టన్నుల నుండి 12 టన్నుల వరకు ... మోయుటకు అనుమతించింది.

♦ ♦ ♦

ప్యాసింజరు బండికి స్వదేశీ యింజన్

రైల్వే కార్ఖానాలో తయారైన తొలి ప్యాసింజరు ఇంజనును రైల్వేలమంత్రి సర్దార్ స్వర్ణ శింగు నేడు ప్రారంభోత్సవం జరిపారు. స్వామి వివేకానంద శతజయంతి వుత్సవముల పురస్కరించుకొని ఈ యింజనుకు "వివేకానంద" అని నామకరణం చేశారు.

♦ ♦ ♦

-: జీపు, రైలుకారు :-

జీపులను తొందరగా రైలుకార్లక్రింద మార్చటానికి వాటిని రైలుకు తగిలించే చిన్న సాధనాన్ని పూనా మోటారు రవాణాశాఖ పోలీసు సూపరింటెండెంటు శ్రీ డి. పి. రావు కనుగొన్నారు.

♦ ♦ ♦

ఇచ్చట పోలీసు కేంద్ర కార్ఖానాలో వారు దీనిని తయారు చేశారు. దీనికి కేంద్ర ప్రభుత్వ పరిశోధనల ప్రోత్సాహసంఘం యిటీవల రు. 1000 లు బహుమతిగాయిచ్చింది. మీటరు గేజ్ రైలు మార్గాలపై వుపయోగించటానికి ఈ జీపును రైలుకారుగా తయారు చేశామని, బ్రాడ్ గేజ్ మార్గంపై వుపయోగించటానికి ఒక తేలికవాన్ రైలు కారుగా తయారు చేశామని శ్రీ రావ్ పత్రికా ప్రతినిధులకు వెల్లడిచేశారు.

ఫోను : 1259 గ్రాము : ప్రెసిషన్

# దుర్గా డీసెల్ హౌస్ (రిజిష్టర్డు)

## మైకో - బాష్ సర్వీస్ ఏజంట్సు

గోపాలరెడ్డిరోడ్, **విజయవాడ-2.**

| | | | |
|---|---|---|---|
| పెర్కిన్సు | మెడోస్ | డేవిడ్ బ్రౌన్ | లిష్టర్ |
| బెంజి | ఫోర్డుసన్ | బైలారన్ | సిడ్లీ |
| లేలెండ్ | ఫెర్గూసన్ | పెట్టర్ | నేషనల్ |

పైన తెలియపర్చిన డీసెల్ ఇంజన్ల పంపులు, పవర్ కేలిబ్రేషన్, అరుగుదల తక్కువగావున్న పాత నాజిల్సు రీ కండీషనింగ్, ఆధునిక యంత్రములపై అనుభవంకల పనివారిచే ఆటోమొబైల్ ఇంజనీరు పర్యవేక్షణక్రింద సకాలంలో చేయబడును.

**మైకో - బాష్** ఎలిమెంట్సు, నాజిల్సు, ఫిల్టర్సు మా వద్ద సరసమైన ధరలకు లభించును.

# THE PREMIER INSURANCE CO., LTD.,

H. O: MADRAS-1.

DIVISIONAL OFFICE FOR ANDHRA PRADESH:

MOSQUE SIDE, MAIN ROAD,

KAKINADA-1. (A. P.)

**R. RANGA RAO**, DIVISIONAL MANAGER.

## LEADING MOTOR INSURERS IN INDIA

VIJAYAWADA OFFICE:
CONGRESS OFFICE ROAD,
GOVERNORPET
Telephone No. 2069.

**D. S. PRASADA RAO**, B.A.,
Officer-in-charge.

HYDERABAD OFFICE:
GUNFOUNDRY,
BURMAN BUILDINGS,
NEAR STATE BANK OF HYDERABAD,
Telephone No. 32401.

**V. RAMA RAO**, B.Sc.
Officer-in-charge.

Edited, Printed and Published by J. Bhaskara Rao, Ravaana Samaachar, Congress Office Road, Vijayawada-2 and Printed at Graama Swarajya Press, Vijayawada-2
Wrapper Printed at Sri Sarada Press, Vijayawada-2.